# ప్రేమ పాలన

(సాంసారిక నవల)








రచయిత

శ్రీమాన్ దీవి శ్రీనివాస అయ్యంగారు

మహిళా
లోకమణియై,
ఉభయవంశదీపకయై,
మమ్ము పిడిచన్న మాతృదేవి
మంగతాయమ్మ
చరణారవిందములకు నీ గ్రంథ
మును నిర్మలభక్తి తా
త్పర్యంబుల
సమర్పించుచున్నాను.

శ్రీ బాల భారతీ సీరీస్ 2

# ప్రేమపాలన

( సాంసారిక నవల )

దీవి శ్రీనివాస అయ్యంగారు





ప్రథమ ముద్రణము

౧౯౩౭

 [వెల 4 అణాలు

## రాజపోషకులు

శ్రీమాన్ బృందావనం శేషాచార్యులుగారు, బి.ఏ, ఎల్.టి.
హెడ్మాస్టరు, పామర్రు.
శ్రీయుత అన్నే రాజమన్నారు వెంకట కృష్ణారావుగారు,
బి.ఏ., బి యల్, ఆత్కూరు.
శ్రీమతి అన్నే బాపమ్మగారు, ఆత్కూరు.
శ్రీమాన్ పండిత దీవి గోపాలాచార్యులుగారు, ఆత్కూరు.

## పోషకులు

శ్రీయుత అన్నే సీతారామయ్యచౌదరిగారు, ఆత్కూరు.
శ్రీయుత బాలకవి కొడాలి నాగభూషణం చౌదరిగారు,
ఆత్కూరు.
శ్రీమాన్ వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు, ఆత్కూరు.
శ్రీయుత నాగులపల్లి రామదాసు చౌదరిగారు, ఆత్కూరు.
శ్రీయుత కుదరవల్లి పున్నయ్యచౌదరి గారు, ఆత్కూరు.

# పీఠిక

శ్రీ పరమేశ్వరుడు మానవహృదయక్షేత్రంబులు
వివిధ ప్రజ్ఞాబీజసమన్వితములుగ నొనర్చెను. ఆ ప్రజ్ఞాబీ
జములు దోహదముచే వృద్ధిబొంది వివిధశక్తులను గల్గిం
చుచున్నవి. శక్తులన్నిటియందును కవితాశక్తి, యత్యద్భు
తమై, నిరుపమానమై వెలుంగును. కవితాశక్తి గలవాడు
కవి. ఈతడు దైవముచే నొసంగబడిన యొకమహానీయు
డని జెప్పకతప్పదు. అతడు దైవసృష్టిలోని పదార్థములను
స్థితిగతులను యథారూపముగ తన గ్రంథపటమున చిత్రిం
చి లోకమునెదుటనుంచి లోకుల నానందింప జేయును.

మఱియు గవిపుంగవుడు భగవంతుని లీలావినోద
స్వభావ స్వరూపములను ప్రదర్శించుచున్నాడు. తన
విజ్ఞానచంద్రికలను ప్రపంచమున వ్యాపింపజేసికొని తత్స
హాయమున భగవన్మహిమను మానవలోక కరస్థమును
జేయుచున్నాడు. కవిభావనాప్రపంచమునకు సృష్టికర్త.
కవి ప్రపంచమున గల పదార్థములు కల్పితములు. భా
స్కరుడు లోకబాంధవుడు. కవి లోకకర్త. కవిత్వము
నవరసభేదంబుల వెలుంగు. అందు శృంగారరసంబు
ప్రధానంబు. ఐహికదృష్టింజూడ నేత్రరసాస్వాదనము
కంటె నితరమేదియు నెక్కుడుగుచి గానరాదు. శృంగార
రసమునకు పట్టుగొమ్మ మాయాస్వరూపిణియైన తరుణీ
లలామ. ( యువతీ తరుణజనాదిష్టా నానందంబు బ్రహ్మ

నంద లేశతుల్యంబని వచియింపవచ్చును.

శృంగార రసభరితంబైన కథను యీ బాలకవి పాఠకప్రపంచకము నెదుట నుంచగల్గి ధన్యుడైనాడు. కవికిది ప్రథమ ప్రయత్న మైనందున యిందు పండితలోకమునకు పెక్కుదోసగులు కనుపించకపోవు. కాని కంటకావృత పుష్పచయంబుల మకరందాభిలాషులగు మధుపములు వ్రాలి కంటకముల వీడి మకరందమునే గ్రోలు భంగి పాఠకులు నీ కథాసారమునే గ్రహియింతురుగాక!

కవి అంబుజంయొక్క నిర్మలభక్తి, నారాయణమూర్తియొక్క అజ్ఞానము, ప్రభాకరుని పశ్చాత్తాపము మొదలగు విషయములను యథాశక్తిని చిత్రించెను. ఈ కవి వేదాంతప్రియుడును, స్వాతంత్ర్యప్రియుడును. తనకబ్బములో నచ్చటచ్చట దేశనాయకుల సిక్షల స్వాతంత్ర్యేచ్ఛను కనబరచెను. ఇందు ప్రభాకరుని తత్త్వబోధ చదివినచో ఈ కవితల్లజుడు తచ్ఛాస్త్రానుభవ మేమాత్రమైనను కలవాడని చెప్పవచ్చును. ఏదియెటులున్నను పాఠకలోకము బాలకవులనాదరించి ప్రోత్సహించుట కర్తవ్యము. "బాలురపైనుండు భారమంతయు" అని శ్రీనాథుడు వక్కాణించినట్లు భావియందు బాలకవులే ప్రౌఢకవులు గాగలరు.

శనివారప్పేట
సెప్టెంబరు ౧౯౩౭

యచ్చాఫన్ మధురకవి
ప్రొప్రయిటరు యస్ట్రొలాజికల్ బ్యూరో

౬౦

# ప్రేమపాలన

అంబుజం అత్తవారింటికి వచ్చెను. కాని, నిరాశ రాలయ్యెను. నారాయణమూర్తి సామాన్యమైన యొక సంపన్న గృహస్థు. అతనికి ధనంతో పాటు విద్య కూడ తక్కువే. కొంతకాలము గృహకృత్యములు మాత్రము అత్త తానే చేసుకొనేది. నవనాగరికతాభిలాషిణియైన అంబుజం తన పృథుశయ్యలను, ఉన్నతాసనములను, తళతళలాడు సౌగంధపాత్రలను, వీణాది పరికరములను, పురాతనాధునిక ప్రణీత గ్రంథములను, సిఘుర్ణకాభిప్రాయములను విడనాడుటకిష్టురాలైనదన నతిశయోక్తి కానేరదు. తన జన్మస్థానమందువలె ప్రాతస్సంధ్యలయందు తల యందు తురుముకొనుటకు నవకోమల మృదుమధుర పరిమళ వికసిత పుష్పగుచ్ఛంబులు గాని; ఆతప బాధచేతను, దిన పరిశ్రమచేతను బాగులుచున్న తన కానందము గూర్చు సరసమనోహర పరిమళావృత శీతల వాయువుల వెదజల్లు, నిరంతర సురభి కుసుమ ఫలభరితోద్యానములు గాని లేకుండెను. కమనీయ కాంచన పద్మరాగ శశికాంత మణిగణ

కల్పిత రాజసౌధముల, మనోహార మృగుల, మంజుల మణిస్థగిత స్వర్ణడోలికల నూగు బాలికామణి, అపరిశుభ్రమైనట్టియు, అలంకార రహితమైనట్టియు, అనారోగ్యస్థితి కనుగుణ్యమైనట్టియు, అసహ్య పరిహాసముల కాస్పదమైనట్టియు పూరి కొంపలో మెలగవలసివచ్చినందుకు విచారపడుతూ వుండేది. దైవమును తలచి ధైర్యముతో నుండెడిది. నెమ్మది నెమ్మదిగా వంట యింట ప్రవేశించెను. అదియే నూతనమగుటచే పొగవల్ల కండ్లెరబారి తలనొప్పి వచ్చినది. కాని, తన ప్రయత్నము మానలేదు. మూడవ నాటికి జ్వరము వచ్చెను. అయినను అట్లే ధైర్యముతో గృహకృత్యములు చేయుచునే యుండెను. అత్త ఆమెను చూచి విచారపడసాగినది. ఇంతకు పూర్వమామె కోడలు వచ్చునదనియు, తాను సుఖపడగలననియు, తనకు విశ్రాంతి దొరుకగలదనియు, ముఖ్యంగా తనకు వంట తప్పుననియు నెంచుచుండెడిది. కాని ఆ కోడలు విద్యాప్రియ యగుట చేతను, సంగీత సాధనయందే సమయము వెచ్చించుచుండెడి దగుటచేతను, పురాణ పఠనమందే యాసక్తి గలదగుట చేతను, వృద్ధావస్థయందు సౌఖ్యపడగలనను ఆశ నిరాశ యయ్యెను.

శిరోవేదనావృతమైన యామె ఒక నాడు తన శీర్షమును వస్త్రముచే గట్టి యగ్నిని ప్రజ్వలింపజేయు, నంమండి వెడలు ధూమముచే నేత్రాంబువులు రాల విసిగి విచా

రింప జొచ్చెను. అత్తరియత్త యామెంగాంచి కౌగలించు
కొని కరుణాశ్రువులచే నామె వక్షస్థలంబును తడుపుచుం
డెను. అంబుజం ఆమె చరణముల పట్టుకొని అమ్మా!
నన్ను క్షమించి కృపాదృక్కుల నాపై బరపుము. తమకు
సేవ చేసి ధన్యత గాంచ గల్గిన యదృష్టమీ యభాగ్యు
రాలికున్నట్లు గానపడదు. నే చేయగల్గిన ......! ఆమె
నధికంగా మాట్లాడనీక "అమ్మాయీ! నేను చాలా నిరాశ
చెందితిని కాని నీ స్థితి గమనించి నంతనే నా దుఃఖమంత
యు మటుమాయమగుచున్నది. సమస్త మండలాధిపునకు
సామ్రాజ్యలక్ష్మి కాదగిన నీ వొక నిరుపేదవాని యింట
బడితివి. ఇట్టి సుకుమార శరీర మిట్టి పనుల నెరవేర్చ
గలదా? నీ భావిజీవిత మెట్లు సౌఖ్యముగా గడువ గలుగు
దవో కదా? నా కాలుసేతులయందు సత్తువుండు నంతవరక
నిన్నలయింప నేను. కష్టములు కలకాలము కాపురములు
చేయవు. ధైర్య మవలంబింపుము భగవంతుడు నీకు సకల
కళ్యాణములు సమకూర్చుగాత!" ఆహా! చూచితిరా
ఆమె అత్తగారి ఆదరణ!!

అంబుజం అబోధ బాలికవలె అట్లాగే నిలబడి ఆమె
వంక చూస్తున్నది. ఆమె భావిజీవితం గాఢాంధకారమున
మగ్గుచున్నట్టుల గాన్పించు చుండెను. అత్తగారు అయిను
రోజుల ఆనందమేగదా! ఇక భర్త యన్ననో అశాంతిచే
శోభాశూన్యుడై యనుభవానందము లేని అమాయకుడు.

పాపమామె తాత్కాలి కాపదను మఱిచి, భావి భయం కరతమోరాసినిగాంచి గాబరా పడుచుండెను.

౨

సౌందర్యము నందు, రూపవతులగు పత్నులు తమభర్తల దాసులుగ చేసికొనగల గొప్ప ఆకర్షణశక్తి యున్నదనుటలో యెట్టి వింతయు లేదనవచ్చు. ఎప్పుడును వారిని తమ కనురెప్పల మాటుననే యుంచుకొన కోరుచుందురు. ఇక గుణవతి గూడా నైనచో దేవతలు సైతము దాసానుదాసులై తమ జీవితమును చరితార్థము గావించుకొన యత్నింతురు. కొయ్య బొమ్మలవలె నేత్రాంచలములపై నాట్య మాడుచుందురు. ఇట్లొనరించుట చేతనే వారి జన్మ ధన్యత నొందగలదని వారి యాశయము.

సౌందర్యమునకు తగిన విద్య, విద్యకు తగిన వినయము, వినయమునకు తగిన సుగుణము అన్నియు అంబుజమందుండుటచే "బంగారునకు తావి యబ్బినదా" అనునట్లుండేది. బంగారువంటి చాయ, తామర రేకుల వలె నొప్పారు నేత్రములు, విండ్లువంటి కనుబొమ్మలు, పల్లవముల వంటి అధరములు, హరిమధ్యమువంటి నడుము,

వినీల కుంతలములు, కోకిల స్వరము చూస్తే శారదాదేవి
యో, లేక సరస్వతియో యనిపించుతుంది. ఆమె ముక్త
కంఠంతో ఆలాపిస్తూవుంటే పశువులుగూడా ముగ్ధులై
పోతాయంటే అబద్ధంకాదు. మదన సామ్రాజ్యలక్ష్మివలె
నొప్పుచు నామె శ్రావ్యతర వీణాగాన మాధుర్యమును
గ్రోలుచో నారాయణమూర్తి ముగ్ధుడు గాడంటే నమ్మక
ముండను. పాడుతూ పాడుతూ ప్రేమోన్మత్తత చేత స్వరం
హీనమయి పోయేది. దానిని గుర్తించి గూడా కోలుకో
లేక పోయేవాడు నారాయణమూర్తి. ఇంతటి పరిపూర్ణ
ప్రేమను పొందగలిగిన యే పతివ్రత ప్రేమోన్మత్త కాజా
లదు! కాని ఆమె తన ప్రియుని ప్రేమాలాపములకు నోచ
బడి యుండలేదు. ఆత డెప్పుడును నోరెత్తి యొకమాటై
నను మాటాడి యెరుగడు. ఆమె ప్రేమతరంగము లాతనిపై
నానాటికి పెంపొందుచు వచ్చెను.

ఆతడు తనకువచ్చు ఆదాయములోనుండి తగుమా
త్రమే వెచ్చించి నిలువచేయు స్వభావము కలవాడు.
కాని గృహలక్ష్మియైన సుకుమారి ప్రేమసి ప్రీతికొరకు
స్వేచ్ఛగ వెచ్చింప బూనుకొనెను. నల్లత్రాచువలె పిరు
దులవరకు వ్రేలాడు నా వాలుజడ శోభను మిఱిమీర
చేయు సంపూర్ణ వికసిత సురభి కుసుమములు తేసాగెను.
రోగబాధలనుండి మాన్ప "రుక్మిణీ కుక్కురు" నొకటి
తెచ్చెను. గోడలకు వెల్లవేయించెను. గృహమంతయు

నాపరాయి పరిపించెను. ఇంటియందొక బీరువా, కుర్చీలు పటములు తెప్పించెను. ఇప్పుడా గృహశోభ వర్ణనాతీతము.

తన అప్రకటిత కాంక్షలనై నృత్యమాడు తన ప్రియుని ఆనందపరవ యత్నింపసాగెను. కాని అతడీమెను గాంచినంతనే దేవీదర్శన మిచ్చినట్లు చాలా భక్తిం జూపెడు వాడు. అంతటి పూర్ణప్రేమతో విప్పారిన ఆమె హృదయము నిరాశచే ముకుళించుకొని పోయెడిది. పవిత్రమూర్తిని అపవిత్రత చేయునేమోయని స్పృశించుటకు గూడ శంకించువాడు. మనోవాక్కాయ కర్మలచే తన జీవితమును ఆమె సేవలందే వినియోగించుటకు సంసిద్ధుడయ్యెడి వాడు. ఆమెను సదా యీ సచరాచరమును తన నిర్మల కాంతిపుంజములచే ప్రకాశింపజేయు సంపూర్ణ సుధాకరునితో సరిపోల్చుకొను వాడు. ఎప్పుడైన యీమెను చూచుట తటస్థించినచో, ఆమె నొక గ్రీష్మకాల ప్రచండ భాస్కరుని వలెను, తన్ను శుష్క సరోవరపు తామర తూడులవలెను పోల్చుకొను వాడు.

ఈతని యీ ప్రవర్తనగాంచి చాలభయపడి యొక దినమున నాతని చేయి పట్టుకొని శయనాగారములోకి దీసికొని పోయెను. పాపము! ప్రాణము లెగిరి పోవుచున్నవేమో యన్నట్లు గాబరా పడుచు చేతిని విదళించుకొని “నన్ను బయటకు పోనిమ్ము” అని మాత్ర మనగలిగెను.

అంత నామె కాతరస్వరముతో "నాథా! మీరు నన్నిట్లు నిరాదరింప న్యాయమా? నాపై ప్రేమదృక్కుల నెందు లకు బనుపరు? మీకీ సంకోచ మెందులకు? సిగ్గెందులకు? రండి, మీ యీ పర్యంకముపై యాసీనులుకండి...... చకోరములు నిర్మల శశికాంతికై నిరీక్షించునట్లు, కాల జీమూత ముక్త నీరంబుల గ్రోల కాంక్షించు చాతకముల వలె, స్వాతంత్ర్య వాయ్వాకర్షణ మొనర్చు తన ప్రియ పుత్రుల నాలింగన మొనర్పగోరు భరతమాత భాతి తమ ప్రేమామృతమును కరువుతీర గ్రోల యత్నించు నన్నిట్లు వేకు చేయతగునా... ...? మీరు మంత్రబద్ధులైతిరా? నన్ను మీ దాసగా నెంచి నాపై నెందుల కధికారము జూపరు? నన్నేందుల కాజ్ఞాపింపరు? నేను నీ చరణసేవా కాంక్షినై ఏకుదెంచ నన్నిట్లు హతాశురాలిని చేయ పాడియా?...... నీ హృదయమున నా కాశ్రయ మెందు లకు జూపరు? నేను మీ యర్ధాంగినిగానా? చెప్పరేమి?"

నారాయణమూర్తి మౌనముగా నట్టే తలవంచు కుని నిలబడియుండెను. ఆమె వెంటనే "భూషలచే నన్న లంకరించి నా సౌందర్యమును గాంచి యే యానందమును బొందజూచుటకు నేనొక నిర్జీవ ప్రతిమననియా? ...కాదు! నాథా! కాదు! అట్లెన్నటికిని కాజాలను. నీ ప్రేమతరంగ ములచే పొంగి పొరలుచున్న హృదయముగల నీ ప్రేమా రాధినిని! నా జీవిత సర్వస్వమును నీ ప్రేమారాధనకై

వినియోగించి ధన్యత గాంచుటకై యేతెంచిన నీ ప్రేమ స్వరూపిణిని. నేను ప్రకృతిని. నీవు పురుషుడవు. నేను శరీరము. నీవు ఆత్మ. నేను భార్యను. నీవు భర్తవు." అం బుజం నేత్రములనుండి కన్నీరు కారదొడగెను. స్వరము నందు తీవ్రత హెచ్చెను. ఆమె నారాయణమూర్తిని బ్రతి మాలుచు నిట్లు పలికెను.

"భూమి నంతయు ముంచుటకో యనునట్లు కారు మబ్బులు గ్రమ్ముచు వచ్చుచున్నవి. కన్నులు మిరుమిట్లు గొలుపు మెరుపులు చూచితిరా, వాటి హృదయముల చీల్చుకొని బయలుదేరుచున్నవి. గాంచితిరా యా యింద్ర ధనస్సు. ప్రళయకాలమంసువలె దిక్కులు పిక్కటిల్లచేయు ధ్వనులతో బయలుదేరు ఆ వజ్రనిపాతముల వీక్షించితిరా? వాయువు స్తంభించిపోయినది. ఈ విచిత్ర సంఘటన వీక్షిం చితిరా? ఏమి ప్రయోజనము! చలన రహితులై అట్లే నిల బడి యుంటిరేల? ఇంకను నా భావముల గుర్తెరుగ లేదా? ఎరిగియుండి యిట్లు పేక్షించుచున్నారే? కష్టపెట్టుచున్నా రే? హింసించుచున్నారే? సరే! వెళ్ళండి. మీ వస్తువుల తృణీకరింతును గాని మిమ్ముల మాత్రమే స్వీకరింతును. నాకు మీ ప్రేమపూరిత హృదయకుసుమమే కావలయు; కాని యీ నిర్గంధకుసుమములతో నాకు నిమిత్తము లేదు. తమ సచ్చరిత్రమునే స్మరింతునుగాని యీ గ్రంథములతో నాకవసరము గానరాదు. సర్వసౌఖ్యప్రదమగు నీవాడిమే

నా కాశ్రయస్థానము గాని యీ యున్నతాసనము లెన్న టికిని గానేరవు. నీ హృదయతంత్రిపై గానముచేయుటయే నా కానందదాయకముగాని నీ వీణా గానముచే హర్షము ను పొందజాలను.... ... ..."

ఎల్లాగైతేనేమి నెమ్మదిగా తప్పించుకొని నిశ్శబ్దం గా బైటపడ్డాడు.

## 3

శ్రీకృష్ణా గోదావర్యాది పుణ్యనదీ జలప్రవాహములచే పవిత్రీభూత మైనట్టియు, శ్రీశైలాది పుణ్యక్షేత్రములచే నలంకరింపబడి నట్టియు, రెడ్డి, కమ్మ, వెలమ మున్నగు మహావీరులచే పరిపాలింపబడి నట్టియు, ఆంధ్ర భోజుడన నొప్పి తన మృదుమధుర వాగ్ధాటిచే స్వకపోల కల్పనలచే గల్పించిన "ఆముక్తమాల్యద" కర్తయు, బాహుబలమున మహమ్మదీయాది శత్రురాజుల దునుమాడి పరరాజుల హస్తగతము చేసుకొని స్వరాజ్య సంరక్షణా ధీరుడైన శ్రీకృష్ణరాయుని కీర్తి పాలనము నొందినట్టియు, బౌద్ధమత స్థూపముల కాశ్రయమైనట్టియు కోటకేతరాజు పరిపాలనయందును, అగణిత వైభవములనొంది "ధరణికోట" యను పేరువహించిన "యమరావతి" పట్టణము నున్నత

స్థానమొందినట్టియు, శత్రువిభేదనార్థము, రహస్యబహిరంగ మార్గముల కనుగుణ్యమైన అనేక బురుజులు గలిగినట్టి మహాకోటల చేతను, సుందర కుసుమ ఫల భరితంబైన యుద్యానవనముల చేతను నిండి యొప్పారు ఆంధ్రదేశమున భారతాంధ్రీకరణ కారణభూతుడైన రాజరాజనరేంద్రుని ముఖ్యపట్టణ మనబడి గోదావరీ స్రవంతి గీతికల నాహ్వానించి స్వాగతమొసంగు రాజమహేంద్రవర మందరెరిగినదియే!

అందు శ్యామలరావను నొక వకీలుండెను. యీ వృత్తియందీయన వేలకొలది ధనమును గణించెను. సుందరోద్యాన మధ్యమున చక్కని సొంత సౌధముండెను. దానియందే యీయన అశేష సంపత్తిచే సౌఖ్యవంతముగ గాలము గడుపుచుండెను. శ్యామలరావు గారికి కుమార్తెలిరువురు. అందు మొదటియామె అంబుజం. రెండో బాలిక సరోజిని. శ్యామలరావుగారి భార్య శాంత. శాంత దగ్గర అశాంతి తక్కువ. విద్యాధికురాలగుటచే వినయ సంపత్తి కూడ చాలావుంది. శ్యామలరావుగారు కాలమంతయు దేశమును దుర్భర దాస్య శృంఖలములనుండి విముక్తి నొందింప వినియోగించెడివాడు. అప్పటికింకను "మహాత్మాజీ" మాతృదేశ్య దుర్భర దారిద్ర్యమును దూరీకృతమును చేయుటకు పూనికొని యుండలేదు. ఒకవైపున తన అశేష జమీందారీ సంపత్తి. మరియొక వైపున కన్నులు

తెరవని పసికందువ లీతనిని గృహాత్యాగ మొనరింప నరి కట్టెను. అంబుజం బి. ఏ. వరకు చదివినది. ఆమె తన తండ్రికి దక్షిణ భుజమై కోశాధ్యక్ష పదవి నిర్వహణము నందేమి, గృహకృత్యములు నిర్వహింపజేయుట యందేమి, అతిధి అభ్యాగతుల ఆదరించుట యందేమి, తండ్రికి వ్యవహారముల పట్ల సలహాల నిచ్చుట యందేమి, నౌకరులచే నూడిగముల చేయించు కొనుట యందేమి కడు సమర్థురాలై వర్తించు చుండెడిది.

ప్రభాకర రావు శ్యామల రావుగారి మేనల్లుడు. పాపం చిన్నప్పుడే తల్లి గతించుటచేతను, తండ్రి ద్వితీయ వివాహ మొనరించుకొనుటచేతను శ్యామల రావుగారికి పుత్రు డుదయించి మరణించుటచేతను దగ్గరకు తీశారు. మొదటినుంచి ప్రతి క్లాసులోను ఫస్టు మార్కులు రావటంచేత యిప్పటివరకు స్కాలరుషిప్పుమీదనే వచ్చాడు. ఇప్పుడితను బి. ఏ. ప్యాసయి మద్రాసు మెడికల్ కాలేజిలో చదువుతూ వున్నాడు. బాల్యమునుండియు ఇక్కడే స్వేచ్ఛగ సంచరించుటచేత అంబుజ ప్రభాకరుల ప్రేమ గూడ దినదినేపి పెరుగుతూనే వచ్చింది. వారు ఒకరిని విడిచి యొకరుండేవారే కారు. ప్రభాకరుడు నవ యౌవనుడు. సౌందర్యోపాసకుడు. సౌందర్యము లక్ష్మీసరస్వతులతో కలిసి "మౌక్తికములందు మాధుర్య మేర్పడినట్లు మంచిగంధతరువునందు సుమధురఫలము లేర్పడినట్లు" ఇత

నిని తేజోమయునిగా నొనర్చుచుండెను. అతడీమెనుదక్క పరస్త్రీలను కన్నెత్తియైన చూచియెరుగ డనియే చెప్పవచ్చును. ఈతె డవివాహితుడు. ఈతనికి మంచి సంబంధములు గొప్పకట్నములతో వచ్చుచుండెవి. ప్రభాకరుడ యిష్టము చూపుచుండుటచే తండ్రి "కుమరుని కిష్టము లేదనచు" తప్పించుకొనువాడు. ఒక పరి కట్నము క్రింద నొక యస్టేటు నిచ్చెదమనుచు వచ్చిరి. ఇందుతండ్రి చాల బలవంత పఱచెను. కాని యతడు "డాక్టరుపరీక్ష ప్యాసయిన పిదప విచారింతమను మిషపై నిరాకరించి తన చదువుకై మదాసేగెను."

నారాయణమూర్తి శ్యామల రావుగారి బావమఅది. ఇంతకుపూర్వమే నిశ్చయమైంది అంబుజా న్నతనికివ్వడం. కాని ప్రభాకరుడుమాత్రం నిరాశ చెందలా. అనుకున్న మాదిరిగానే అతివైభవంగా జరిగింది అంబుజం వివాహము. సాధారణంగా ప్రేమోన్మత్తుడు స్వార్థపరుడగుచున్నాడు. గాయముచే బాధపడురోగి, చాలబాధపడుచున్నను, బాధను భరించలేక కేకలిడుచు పారిపోవుటకు ప్రయత్నించుచున్నను, ప్రయత్నము విఫలమగుటచే వదలిపెట్టవలసిందని ప్రార్థించుచున్నను, ప్రార్థన నిరాకరించినచో దూషించు చున్నను, సరకుగొనక గాయమును బహు నిర్దయతో చీల్చి దానిని మాన్పి తుదకు అట్టి రోగి చేతనే ప్రణుతులు గొనుచున్న వైద్యుడు స్వార్థపరుడు

గాడా? అట్టి వైద్యుని కఠిన హృదయుడనుట భావ్యమా?

ప్రభాకరుడు ఒంటరిగా కూర్చొని తాను అంబుజం ఉద్యానవనంలో విహరిస్తూ వున్నట్లు, ఆమె తన్నే వివాహ మాడుటకు సమ్మతించినట్లు, యూహిస్తూ వుండేవాడు. ఒకమూల నిరాశ నిలబడి పోట్లాడేది. వారిరువురొక పూ పొదరింటి మాటున కలిసికొనినట్లు, అప్పుడు తాను ఆంగ్లే యాచరణానుసారము చేయి ముందుకు జాపినట్లు, ఆమె కరస్పర్శ గావించుతరి తను ఆమె చేతిని ముద్దిడుకొనినట్లు ఆ సమయమున నేతనకొక శబ్దము "ప్రేమాంధా! ప్రభాకరా! నీ ప్రియురాలి హృదయ మెరిగి వర్తింపుమని" విన బడినట్లు, అందులకు తాను పదునాలుగేండ్లు ఒకేచోట పెరిగి ఒక్కచోట చదువుకొని, ఒకేరీతిగ ఆడుకొనిన నీమె హృదయమే నే నెరుంగనా? ఇట్టి సుందర స్వరూపుని నాపై అంబుజానికి ఆంతరిక ప్రేమ లేదనగలరా? పంజర బద్ధ పతంగ పలాయనపుకీతి, అవకాశము కొరకు నావ కాశముగ గడుపగలదు లెమ్మనుచు ఆకాశ హర్మ్యాలు నిర్మించుకొంటూ వుండేవాడు.



## ౪

మధుమాస మారంభమైనది. పుష్పములు తమ పుష్పోడిని గ్రోలుటకై వచ్చిన మధుపముల హృదయావేగము నణచుకొనజాలక ప్రేమాలింగనములచే బంధించుచుండెను. లతలు లతాంత భారముచే వినమ్రములై కామినీ కాముకుల స్వాగతోత్సవములచే సన్మానించుచుండెను. సముద్రుడు తన ప్రియపుత్రుడైన చంద్రుని నక్కున జేర్చుకొన నేగుచుండెను. ప్రియుడైన పద్మబాంధవుడు తమ్ము విరహాగ్ని మధ్యమున విడిచి వెళ్ళుటచే విచారముచే ముకుళిత ముఖులైన కమలముల గాంచి కలువలు పరిహాసించుచుండెను. నవకోమల మృదుకిసలయావృత రసాల పల్లవములజొక్కి మదోన్మత్తులైన కోకిలారావంబులు పంచమశ్రుతీ నినాదంబుల బోలియుండె.

అంబుజం అవస్థ ఆమెకే అనుభవం. మధుమాసపు మధుమిశ్రిత మలయమారుత మామె నున్మత్తినిగా తయారు చేసెను. ప్రేమోన్మాదమున నామె తన బాహుపాశముచే నారాయణమూర్తిని బెనవైచెను. ఆ తనువు ప్రేమ శూన్యమగుటచే నామె బాహుపాశము నిశ్శూన్యమయ్యెను. అంతటామె దీర్ఘ నిశ్వాసమిడచెను. అది నెమ్మదిగ అవకాశమున అంతరించెను. క్రోధము, నిర్లక్ష్యము, అసంతృప్తి, విచారము, అభిమానము, అన్నియామె

యందొక్కసారి మూర్తీభవించినవి. కాని చేయగల్గిన
దేమి? నిరాశచే హతాశురాలైనది. దుఃఖభారముచే—
"హే జగత్ప్రభూ! ఇదియేనా నీ న్యాయపరిపాలన.
నా కెట్టి ధైర్యమును గలిపెదవు. నా జీవితమింతయేనా?"
అనుచు బయటికి పోయెను.

నారాయణమూర్తి వ్యథావ్యక్త కంఠంతో "అంబు
జం! నన్నెట్టి అత్యాచారమునకు పురికొల్పితివి. నాపై
వ్యర్థముగ క్రోధము చూపవద్దు. పవిత్ర పూరితమై, దేవీ
తుల్యమైన నిన్ను అపవిత్రురాలనుగ జేయ పురికొల్పితివే?
నాయొక్క భక్తిభావముల నశింపజేసి వ్యభిచారము సల్ప
సమకట్టితివే?... నేను నీ యెదుటకు రాగానే నా భావ
ములన్నియు మారిపోవుచున్నవి. నిన్ను గాంచగనే దేవీ
సాక్షాత్కార మబ్బినట్లుండును. అదివరకున్న సుఖకాంక్ష
లన్నియు నెచటికో మటుమాయమై పోవుచుండును. నీ
వొక స్వర్గమునుండి యేతెంచిన పవిత్ర మూర్తివి గాని
సామాన్య వ్యక్తివి గాదు. నీతో సౌఖ్యము లందుటకు నా
కు సాహస మొదవుట లేదు. సౌఖ్యాతురుడనై నీయొద్దకు
సాహసించియే వచ్చుచుంటిని. కాని నిర్మల తేజోమయ
మగు నీ ముఖమును గాంచినంతనే వివశుడనై పోవుచుం
టిని. అంతియేకాని నీవు నాపై మాత్రమాగ్రహించవద్దు.
భవదీయ దివ్య మూర్తిని గాంచుచు, అకుంఠిత కలకంఠ
నినాదమును వినుచు నేను నా ప్రాణముల నిలుపుకొం

దును. బహుశః యే దినమున నీ పవిత్రమూర్తి దర్శన మబ్బనేరదో నాడే నా ప్రాణములుగూడ నిలువజాలవు! నీవే ఐహిక భోగేచ్ఛలను మాత్రము కోరవలను. నీవు సదా నీ గానామృతముచే నన్ను తృప్తునిగా చేయుచుం డుము. ఇంతియ చాలనుచు తన గదిలోని కేగెను.

*    *    *    *

ఇప్పుడంబుజంగూడ తన ప్రవర్తన మార్చుకొన సాగినది. తన యందమును, విద్వత్తును ఏవగించుకొ నెను. తన కాలమంతయు అత్తగారి కుపచర్యలు చేయుట యందే వినియోగించు చుండెను. ఆమెచే నెట్టిపనియు గూడ చేయించుట మానెను. సాయం సమయములందు వీణ వాయించు కొనుటకు బదులు, అత్తగారి పాదముల నొత్తుచు, మనోహరమైన పతివ్రతా మతల్లుల కథలు విని పించుచుండెను. మధ్యాహ్న సమయములందు పూలు ముడుచుకొనుట, శృంగారించుకొనుటకు బదులు రాట్నము సరిచేయుచు, నూలు తీయుచుండెడిది. మఱియు మాతృదేశ దీనావస్థను తెలుపు కథలను చదివి వినిపించు చుండెడిది. ప్రాతః కాలముననే లేచి యత్తగారిని స్నానము చేయించి, ఆమెకి పూజాసామగ్రి సమకూర్చి తాను వంట యింట ప్రవేశించేది. రాత్రియందు రామాయణము ఆమెకు వినిపించుచు ఆమె వద్దనే నిద్రిస్తూ వుండేది.

నారాయణమూర్తి పుష్పాంజలులై వచ్చాడు.

గృహకార్య నిమగ్నయై యున్న యామెకు అందజేయ లేకపోయాడు. గానామృతమును గ్రోల కాలమున కెదురు చూచినాడు. వ్యర్థమె. అతనికి పిచ్చియెత్తినట్లయినది. తిన్నగా బయలుదేరి యొక తోటలోని బోయి కొలనియొద్దున గూర్చొనెను. కమ్మని సువాసనల వెదజల్లు కమలముల లోని మధువును గ్రోలు దేంట్లను తమ హృదయకోశమున దాచుకొనుట గాంచి కలువలు వెకవెక నవ్వుచుండెను. వినిర్మలమై, నిశ్చలమై, ప్రశాంతమై, నీలవర్ణమై నొప్పు నీటిపై బంగారు తివాచీ కప్పినట్లుండెను. జలజంతువులు ఆహారాన్వేషణ పూర్తిగావించి విశ్రాంతి కొరకై జలగర్భమున ప్రవేశించెను. పిపాసాబాధితుడైన బాలుడు తల్లి యొడియందెట్లు దూరి దాగుకొనునో అట్లే సూర్యుడు దిన పరిశ్రమచే అలసటచెంది భూగర్భమున ప్రవేశించుచుండెను. వృక్షాగ్రములన్నియు బంగరుపూత పూయబడినట్లుండెను. శకుంత సంతానములు తమ గృహములవైపునకు మరలినవి. అతని కిప్పుడు ప్రకృతియంతయు ప్రేమమయముగ గాన్పించు చుండెను. ఉద్రేకపూరితు డయ్యెను. ప్రేమోన్మత్తు డయ్యెను. "నేను సాహసించి నా భావములనెడు భూతముల బారదోలి కలియనేగెదను. నా యాజ్ఞల కెందులకు లోబడను? ఆమె నా భార్య. నాకుపచరించుటకే కాని పూజార్హురాలుగాదు. అంబుజం! నిన్ను పూజనీయురాలిగా భావించి నిన్ను హింసించితిని. నీ యిచ్ఛ

నెరవేరగల సుదినములు వచ్చినవి. నిన్నింకను విరహాగ్నిచే దహింపచేయను. నీ ఒడియందే నిద్రించి నా జీవితమును ధన్యత గావించుకొనెదను. నేడీ పరిపూర్ణప్రేమ నా ప్రతి రక్తనాళమునంతను, ప్రతి నరము నంతను బూర్ణముగ వ్యాపించి విద్యుద్వేగమున పరుగెత్తు చున్నది. నీవే నా యర్ధాంగివి, నీవే నా సహచారిణివి, నీవే యీ సంసార సముద్రమును సౌఖ్యముగ దాటించగల తెప్పవు. అంబుజం! నేను తర్క వితర్కములు గావించుకొనియే నీ వద్దకేగుచున్నాను. కాని నిన్ను చూడగనే విద్యుత్కాంతివల్ల కన్నులు మిరుమిట్లై వెనుకకు తిరుగుట తటస్థించుచున్నది. కాని బైటకువచ్చి భోగాభిలాషా తుపానుచే కొట్టుకొనిపోవు చున్నాను. ఇక నీ పరిష్వంగ సౌఖ్యమును బొందక నిలువజాలను. ఇంక చిత్తమును గుప్పిటయందిరికించి యుంచజాలను. లేక ఎంతకాలమిట్లు గడుపగలుగుదును? ఎంతకాల మీ సంభోగేచ్ఛను ఆపియుంచ గలుగుదును? ఎక్కడికేగుదును? ఎవరితో మొరలిడుదును? మార్గదర్శకులెవరు? ...... ! కానిమ్ము! ధైర్య మవలంబింతును. దైవమే దారిజూప ......!"

"దైవము సోమరులమాట" అనుచు ఎవరో నిలబడ్డారు ఎదుట.—

కొంచెములికిపడి "ఎవరు నీవు?"

"నేను కృష్ణమూర్తిని"

"ఎక్కడనుండి రాక?"

"మద్రాసునుండి. సరేకాని నీ విప్పుడు దైనమని పలుకు చుంటివేల?"

"ఏమియును లేదు."

"అట్లుకాదు. నాయొద్ద దాపరికమేల? అయినను నీ ముఖము కళావిహీనమై యున్నదేల? మిత్రమా! నేనొకటి చెప్పెదను విందువా?"

"ఏమది?"

"నీవు రెండవ వివాహము గావించుకొనుము."

"ఎందులకు?"

"అపుత్రస్య గతిర్నాస్తి అను లోకోక్తి ననుసరించి మనము వివాహమాడునది పుత్రులకొరకు. అట్టి కుమారులు గలుగు లక్షణము లిప్పటికైదేండ్లైనను గాన్పించుట లేదు. ఎట్టి విద్యావతియైనను, ఎట్టి సుగుణవతియైనను కుమరులు లేనిచో నిర్గంధ కుసుమమువలె నిరుపయోగమే గదా! అదియునుగాక ఆమె తన వీణయేమో, చదువేమో గాని నీ సౌఖ్యమున కుపకరించుచున్నదా? అత్తగారికి సేవలొనరించునా? మరొక రహస్యమును తెలిపెదను. ఆమె ప్రేమపాత్రుడు వేరొకడు గలడు."

ఈ మాట వినగానే నారాయణమూర్తి అసహ్యభావముతో "నీ విటువంటి మాటలు నా యెదుట చెప్పవద్దు. నేను వినను."

"ప్రమాణము చూపినచో?"

నారాయణమూర్తి ఆశ్చర్యముతో మౌనము వహించెను. అంత జేబునుండి యొక కవరుతీసి చూపించి "నేడు మధ్యాహ్నము నేను మీయింటికేతెంచునప్పటికి మీ యింట నెవరును గాన్పించలేదు. అప్పుడే తపాలావాడొక కవరును తెచ్చి నా కిచ్చెను. ఇది ప్రభాకరుని దగ్గరనుంచియే వచ్చినది" అనుచు నింటివైపునకు మరలిరి.

అట్లైనచో ప్రతి నెల వచ్చుచునే యున్నవి. వాటిసంబుజం చూడకుండ చించి పారవేయుచున్నది. నేను చూచుచునే యుంటిని. సమాధానమును వ్రాయమనెడి వాడను గాని నిరాకరించెడిది. ఏదీ, యుత్తరమును చదువుము."

"ప్రేయసీ!

నీ ప్రేమపత్ర మందినది." చూచితివా! నీవు వ్రాయలేదంటివే? స్త్రీ లెటువంటివారో తెలియునా? నిగ్రహానుగ్రహ సమర్థులు, రాజ్యాంగ పరిపాలనాకౌశల ధీమతులు, కర్క-శహృదయ గాత్రులు, సిగూఢమతులు, కరుణా విహీనవతులు, స్వాతంత్ర్య మూర్తులు, పరిపూర్ణ రతి సౌఖ్యదాతలు, కృత్రిమ నాటక రచనా తంత్రులు. అట్టివారినా నమ్ముట."

"తరువాత చదువుము."

"మన ప్రేమపాశమును త్రెంపజూచిన పెద్దల చేతలు వ్యర్థమౌనట్లు వివాహ మాడవలయు"

"ఇందుకేమందువు. సరే!— అట్లుంచుము. నేనొక మాట యడిగెదను. సరియైన ప్రత్యుత్తర మిచ్చెదవా?"

"అట్లే యిచ్చెదను."

"నీవు రాత్రి యెచట పరుందువు? మౌనము వహించుము. నిజము వక్కాణించుము. అబద్ధమాడవద్దు. అంతయు నే నెరుంగుదును."

"ఎరిగియుండినచో నన్నడుగనేల?"

"నిన్ను చైతన్యునిగా చేయుటకు! అట్లయినచో ఎందులకు నిద్రించుట లేదు?"

"నా యిష్టము మీదనే?"

"అట్లయిన నీవు ఐహిక సుఖముల కోరుట లేదా?"

"కోరుచునే యుంటిని. కాని దేవీస్వరూపిణియైన యంబుజం ఎదుట నిలువజాలక పోవుచుంటిని. ఇందువలననే నా కోరిక నిష్ఫలమగుచున్నది."

"అవును. ఆమె దేవియా? నరరూప పిశాచిని. అది నీపై తన సౌందర్య సుధనుజల్లి వశపఱచుకొనినది. నిన్ను దాసునిగ నొనర్చుకొనినది. నీ మనస్సును మార్చివేయుచున్నది. ఆమె ప్రభాకరుని, ప్రాణముకన్న మిన్నగా గలించుకొనుచున్నది. నిన్ను కాలవాహినిలో త్రోసి తాను విధవా వివాహ మొనర్చుటకు గూడ సిద్ధపడుచున్నది. వారు ఆంగ్లేయ భాషాప్రవీణులు."

"మిత్రమా! నీవిట్లు పరుషములాడ జనదు. ఆమె నీ

కొనరించిన యపకృతియేమి? నన్నిట్లు శంకాకుల మాన
సునిగా తయారు చేయుటయందు నీ యభిప్రాయమేమి?
దేవిసమానురాలిని దానవినిగా జేయుటయందు నీ యుద్దే
శమేమి? పతివ్రతామతల్లులకు మార్గదర్శకురాలు కా
దగిన సతిని కుల్టగ నొనరించుట యందు నీ భావమేమి?
స్వర్గతుల్యమైన నాగృహమును నరక మొనరింపకుము.
అమృత కలశమునందు హాలాహలము కలుపజూడకుము.
నన్నింత మాత్రము నిర్బంధించక పొమ్ము."

"ఆహా! నీ మిత్రాదరణ! 'వినాశకాలే విపరీత బుద్ధిః'
అన్నట్లు చెడురోజులు ప్రాప్తించినప్పుడు నా హిత పలు
కులు చెవిసోకునా? నీ స్వర్గమును పాడుచేయ నా కేల?
నీ సుఖమనుభవింపుము. అతిథినై వచ్చిన నన్నిట్లు నిరాద
రణ చేసితివి. చాలు. నే పోవుచుంటి" నని యాగ్రహము
తో లేచి పోవుచుండెను. అంత నారాయణమూర్తి ఆలో
చనా హీనుడై "మిత్రమా! ఆగ్రహింపకుము. నీ ఇచ్ఛా
ను సారమే మెలంగెదను. నాకు నిదర్శనములు చూప
వలయును. నీవిట్లనవసరముగ దూషించుటచే కినిసి యట్లం
టిని. వంశవృద్ధి యందువా? అందుల కొప్పుకొందును."

"అట్లనుగుము. నేను మద్రాసునుండియే వచ్చుచున్నా
ను. ప్రభాకరుడు నా స్నేహితుడు. అతడు స్వయముగ
యీమె వ్రాసిన వుత్తరమును నాకు జూపి యన్ని విషయ
ములు జెప్పినాడు. నాకతనిపై చాల అసహ్యత కలిగి

నీమీఁద ప్రేమచే నిన్ను బాగుచేయ నిచ్చటికి వచ్చితిని. ఆంగ్లభాషా పరులందరు నిట్లే.........ఇదిగాక, మీ మరదలు వివాహ మటగదూ! ప్రభాకరుఁడు చెప్పినాఁడు. నీవు వెళ్లెదవా?"

"ఆదివారగం రోజున బయలుదేరి వెళ్లెదము."

౫

ప్రభాకరుఁడు ఉద్యానవనములో ప్రవేశించగనే అంబుజా గూడ అక్కడే ప్రత్యక్ష మయింది. చాలా యానందముతో "ప్రేయసీ! సంగతులేమి" అనుచు చేతిని చేతిని గలిపెను. అంత వారిరువురు పూపొదరింట జొచ్చి యచ్చట యొక తిన్నెపై గూర్చొనిరి.

"ఏమి ప్రభాకరా! నీ చదువిప్పుడుతో పూర్తియగు ననుకొందును. నీవొకపర్యాయైనను మా గ్రామము వచ్చి యుండలేవుగదా?"

"నేను నీకింకను జ్ఞప్తియందు ఉంటినా? ఆ దినములు తలంచుకొనినచో మానసము మరింత రవ్వలొత్తుకొనుచుం డును."

"దానికేమి లెమ్ము. రోజు లెప్పుడును అట్లే గడువ గలవా?"

"తనువులు వేరైనంతమాత్రమున మన ప్రేమలత పెరిగి పోవునని పరులైనను పాటించగలరా? అంబుజం! ఇట్లు కృశించితివేల? పూర్ణసుధాకరుని ధిక్కరించు నీ నెమోము వివర్ణమై యున్నదేల?" అనుచు ఆమె గడ్డమును పుచ్చుకొని తనవైపునకు త్రిప్పుకొనెను.

"భగవంతుని లీలలతి విచిత్రములు గదా!" యనుచు రెండశ్రువులు రాల్చెను. వాటిని తన జేబురుమాలలో మరగుపరచుచు, "అంబుజం బేలవై ఏల యీలీల బాగులు పడెదవు. నేనుండ నీకీ విచారమేల?" అనుచు ముద్దిడుకొనెను. ప్రభాకరాంబుజాలకు తమ చేతలు మేడపైనుండి కృష్ణ, నారాయణమూర్తులు పరికించుచున్నారని యెట్లు తెలియగలను. నారాయణమూర్తి యీ కృత్యములను గాంచి క్రోధోద్రేకముచే వణకిపోవుచుండెను.

"నీ కోపమునకు వణకు వారెవరును లేరు. ఇప్పట్ల నీ క్రోధమంతయు వ్యర్థమే? ఇప్పటికైనను తెలిసినదా? నాడు నా పలుకుల కలిగితివే? ఇప్పుడే మొనరింతువు? ఆమె నిన్నెట్లయినను విడుచుట సిద్ధమని రూఢియైనది కదా? కర్తవ్యమేమి?"

"నాకేమియు గోచరించుటలేదు. అన్నిటికి నీవే? నీవేది చేయుమన్న అదియే చేయుదును. నన్ను మాత్రము ఒడ్డునకు చేర్చు. అదియే నే కోరునది"

ఇంతలో ప్రభాకరరావు వచ్చి 'కృష్ణా' అని పిలచెను.

వెంటనే కృష్ణమూర్తి అతనితో గూడ నేగెను.

"పని యంతయు నయినదా?"

"అయినది. అనుకున్నది ఆలస్యముకాకుండా అందించాలి."

"ఇప్పుడు సగమే యిచ్చెదను. మిగత మొత్తము పని పూర్తియైనతరువాత యిచ్చెదను.... ఏమనుచున్నాడు?"

"ఏమంటాడు మానవుడు. అంతా చూచాడు. నిర్ఘాంతపోయాడు. చెప్పవలసినదంతా చెప్పాను."

"అంతటితో సరికాదు మరి. రెండో వివాహము చేయాలి."

"అందుల కింత యాలోచన యేటికి?"

"ఇంకొకటి. అంబుజాన్ని మరల అతని యింటికి తీసుకొని పోకుండా యత్నించాలి."

"అట్లాగే!"

"సరే. జాగ్రత్త" అని చెప్పి తాను మద్రాసునకు వెళ్ళినాడు.

* * *

"ఏమి టాలోచించుచున్నావు?"

"దుర్మార్గుని దుష్టచర్యలు."

"నేను చెప్పలా, వాడు దుష్టుడని?"

"నీవు కాదా?"

"ఏమిటి నన్నుగూడ దుష్టులలో దూర్చుచున్నావా?"

"దుష్టుడవేకాదు. దుష్టనాయకుడవు."

"సాక్ష్యము."

"దీని కంతకు నీవ కారణము కాదా? నీ యాజ్ఞాను వర్తియొకదా మెలగుచున్నాడు ప్రభాకరుడు?"

"అట్లా అడగాలి. లేకపోతే నిజం ఎట్లా బయలు పడుతుంది? చూడు యీ పైకము. ఈ పైకంతో మెడ లోనికి యొక గడియారపు గొలుసు చేయించవలె నని చెప్పి యిచ్చినాడు. మిగతా పైకం తర్వాత యిస్తాడు."

"ఎవరికీ గొలుసు?"

"ఎవరికా? ప్రియురాలికి."

"అంటే."

"అంబుజానికి. అందుకొరకే నన్ను పిలిచాడు. ఈ సంగతి తెలుసుకొనకుండగనే నన్ను దూషించ మొదలు పెట్టావు,"

"తొందరపడి దూషించినందుకు క్షమించు మిత్రమా! అయితే యెప్పుడు వివాహము?"

"ఎట్లా తెలుస్తుంది? వారిద్దరు లండను వెళ్ళుతారట."

"ఎప్పుడు? ... అయినా అంబుజం ఒప్పుకున్నదా?"

"తన తండ్రికి అపకీర్తి వచ్చునేమోయని భయపడుచున్న దట"

"ఇక కర్తవ్యము!"

"నిన్ను చంపినచో యామె యింటివద్దనే స్వేచ్ఛగా

యుండగలను. అప్పుడు విధవావివాహ మొనరించుకొన వచ్చునని వారియాశయము."

"మిత్రమా! పరిస్థితులు చాలపరిమితి మీరుచున్నవి. నా మనస్సాందోళనచే తపించుకొనుచున్నది. యేమిచేయ వలయునో తోచుటలేదు"

"చేయునదేమున్నది. ఇప్పుడు ఒంటిగంట అయినది. ఇప్పుడే యెవరికగుపడకుండ బయలుదేరి పోవుదముపద. ఆలోచన తరువాత చెప్పెదను."

అంత వారిరువురా నిశిని బయలుదేరి పోదొడగిరి. దారియందు నారాయణమూర్తి "మిత్రమా! అంబుజమునకు నాపై ప్రేమ లేదందువా" అనెను.

"ప్రేమా? మిత్రమా! ప్రేమ యెప్పుడును సమానుల యందే యుండును. చూడుమూ జనించును. సౌందర్యమునందుగాని, విద్యయందుగాని, వయస్సునందు గాని, ప్రేమ యందుగాని యొకరికొకరు తీసిపోవువారు గారు. ఇంతేందులకు బాల్యమునుండి యొకేచోట పెరిగి, ఒకేచోట విద్యనభ్యసించిన యా సౌందర్యమూర్తిపై ప్రేమజూపక నీయందు జూపగలదా? పురుషు లెట్లు పరిపూర్ణ యౌవనోద్భాసితులై విలసిల్లు సుందరీమణుల ప్రేమ కొఱకువ్విళ్లూరు చుందురో, యట్లే యువతులు గూడ రూపవయోవిద్యావంతులగు యువకులపై తమ దృక్ప్రసారములు బరపు చుందురు. ప్రేమోన్మత్తయై అంబుజ ప్రభాకరుని పరి

రంభ సౌఖ్యమునకు పురికొల్పుచున్నది. ప్రేమపంజరమున పెండలకడనే ప్రవేశించుటకు ప్రోత్సహించు చున్నది. తొందరించు చున్నది. కాని స్త్రీ బుద్ధి నెరిగిన ప్రభాకరుడు కొంచెమాలోచన చేయుచున్నాడు. స్త్రీలు చంచల చిత్తలని యెరిగియుండుటచే యింకను పరీక్షించు చున్నాడు. మిత్రమా! 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అని నీ వెప్పుడును వినియుండలేదా? ధర్మాధర్మములను గూడ విచారించుట లేదు. నేను నీ హితచింతకుడ నగుటచే నింత చెప్పవలసి వచ్చినది."

"సరే! కాని- నన్నెట్లు రక్షించెదవో సుమీ? ఇక నీ యిచ్ఛానుసారమే మెలంగెదను."

"నీ వింక విచారించ వలసిన పనిలేదు. నేనొక మాట చెప్పెదను అందులకు సమ్మతింతువా?"

"ఇంకను సమ్మతింతువాయని యనుచుంటివా? ఈశ్వర సాక్షిగా నీ చెప్పిన చొప్పుననే యొనరించెదను. నా ప్రాణదాతవు. నా రక్షకుడవు."

"సరే! అట్లయిన రెండవవివాహము చేసుకొనెదవా?"

"నీ యిష్టానుసారము."

"శ్యామల నెరుగుదువు గదా?"

"నీ చెల్లెలు శ్యామలయేనా?"

"అవును. ఆమె భారత భాగవత రామాయణాలు మాత్రం చదువుకున్నది. ఇంగ్లీషు చదువుకున్నది కాదు. పని

పాటలు బాగుగ చేయగల పడతి. కురూపికాదు కదా! నీకును అత్తగారికిని సేవచేయగల సేవకురాలు. సామాన్య గృహస్థుని బాలిక. నీకేమైన అభ్యంతర మున్నదా?"

"అభ్యంతర మెందులకు? నీ యిష్టమే నా యిష్టము. నీకు వ్యతిరేకించి నడువగలనా?"

"అయితే కట్నం మాత్రం యివ్వలేను. ఖర్చు అంతయు గూడ నీవే భరించవలయుసుమీ?"

"ఖర్చుకేమిలే. నీవేమియు నీయనక్కరలేదు."

ఇంతలో రైలుదిగి యింటికేగిరి.

౬

"చక్కగా చెప్పుతున్నావే?"

"వినాకన్నా!"–

"సరేకాని,- యీ వుంగరంచూడు"

"చాల బాగున్నది. చక్కని పుష్పలత చెక్కాడే?"

"అవును మన ప్రేమలతగూడ ఆ విధంగానే అల్లుకుపోవాలిసుమీ!"

"అల్లుకొని యుండలేదా?– దీనిఖరీదెంత?"

"నూటయేబదిరూపాయలు. ప్రేమకానుక."

"నూతనవధువు సరోజినికా?"

" కాదు నీకే!" ( ఉలికిపడి )

" నాకొరకా! సరోజినికిద్దాం. చక్కగా ధరించగలదు"

" అట్లయినచో నాపై నీకు ప్రేమలేదా? "

" సరే యిమ్ము. "అతనే యామె వ్రేలికి ధరింపజేశాడు.

" నేనొకమాట చెప్పెదను వినియవ్వుకదా! "

" ప్రియురాండ్ర పలుకులు ప్రియులకు ప్రేమపాత్రములు గాకుండునా? "

" నీవు నవయౌవనుడవు. నేనో పరిపూర్ణయౌవనవతిని అత్తోటి మనమిరువు రిట్లొంటరిగానుండు టొరులుగాంచినచో చెడుఅభిప్రాయమునకు తావుండదూ? "

ప్రభాకరుడు మౌనము దాల్చెను.

" ప్రభాకర్! నీ చదువు పూర్తియైనది. రూపవయోవంతుడవైతివి. జ్ఞానాజ్ఞానవిచక్షణతగల్గినది. ఇంకను వివాహమాడకుండుటకు కారణమేమి? "

" చిత్తమంగీకరించుటలేదు. "

" ఎందుచేత? "

" ప్రేమ శూన్యమగుటచేత "

" ప్రేమపాత్రముగ నొనరించుకొనరాదా? "

ప్రభాకరునికేమి మాట్లాడుటకును ధైర్యము చిక్కుటలేదు. ఎట్లు మాట్లాడిన యెట్లు పరిణమించునోయని భయపడుచుండెను. అప్రయత్నంగా అతని నోటి

కొంబడి "నీవు" అని వచ్చి వెంటనే యాగిపోయెను.

"ప్రభాకరా! ఆ ప్రయత్నమును పూర్తిగ పరిహరించుకొనుము. మోహమును మనస్సునుండి మరల్చుకొనుము. ప్రపంచపు నియమములను పరిపాలించుము..."

పాపము! ప్రభాకరుని కన్నులశ్రువులచే నిండి పోయెను. అంబుజం కన్నీరు తన చేలాంచలముతో కన్నుల నద్దుచు—

"ధైర్యమును గోల్పోకుము. సంసార సాగరమును సౌఖ్యముగ దాటవలెనన్న ఆశను నశింప చేయాల్లి. నీవు ఎట్లైనను వివాహమాడి సౌఖ్యవంతుడవు గమ్ము." అంబుజం నేత్రములు గూడా ప్రేమాశ్రువులచే నిండిపోయెను. ప్రభాకరుడు ధైర్యముతో "నేను నీ ప్రేమార్థిని."

అంబుజం ఏదో మాట్లాడటాని కుద్యమిస్తుంది. ఇంతలో తండ్రి "అమ్మాయీ!" యని కేకవైచుటచే లోనికి పోయెను.

* * *

ఆ రాత్రి ప్రభాకరునికి నిద్రపట్టలేదు. ఆమె అంగీకరించు నట్లగపడుచునే యున్నది. కాని మాట్లాడుటకు ధైర్యము చిక్కుటలేదు. ఏమిచేయవలెను? ఎట్లు పల్కరించవలెను...? విని యేమనునో గదా! ఆమె హృదయములో కూడ నింతటి ప్రేమ యుండునేమో? తెలుసుకో

నుటెట్లు? ప్రేమ శూన్యమైనదా "ఆకలిగొన్న సింగము" గాగలదు! కాదు! కాదు! ప్రస్తావనట్లు తేరాదు. హిందూ స్త్రీలకు పురాణములే ప్రమాణములు. నూతనపథమును త్రొక్కుటకు వెరచు చుందురు. ఆమె తండ్రికూడ యంగీకరించకపోతే?...విదేశముల కెళ్లాలి. తండ్రిని విడుచుట కంగీకరించదేమో?...యేమో! యేమియు దోచుటలేదు, ఇప్పుడాలోచించను. కానిమ్ము! వివాహానంతరము విని యోగిద్దాం విధాతవ్రాలు వేరుపరచుటకు! ప్రేమ పెరిగి పోగలదు. ఆధారము అణగిపోగలదు. వప్పుకొనక తప్పదు......!" కండ్లు మూసుకొని పోవుచుండుటచే మేను వాల్చాడు.

*　　*　　*　　*　　*

పోస్టుజవానొక వుత్తరము తెచ్చియిచ్చెను. దానిని అంబుజం విప్పి చదివి నిశ్చేష్టురాలైపోయెను. కన్నీరు గార్చుచు "విధిప్రేరితము విఘ్నమొనరింప గలమా!" అని మాత్రము నుడివి యేడ్చుచుండెను. సరోజిని వచ్చి యా వుత్తరమును చూచి "ఇంతమాత్రమునకే భీతిలుచుంటివేమి? మనవల్ల నేమైన తప్పుయున్నచో భయపడవచ్చు. ఇది మనల బెదిరించుటకే. నాన్నగారిని అక్కడకు పంపుదము. అన్ని విషయములు తేలగలవు."

"ఆయన దైవసమానుదు. అట్లే జరుగగలదు. మన ప్రయత్నములన్నియు నిష్ప్రయత్నములే కాగలవు. తండ్రిగా

రిని కూడ అక్కడకు పంపి వారికి మితిలేని పరాభవమును చేకూర్చిన వారమగుదుము. అందువలన లాభమేమాత్రి మును నుండజాలదు."

"కానిచో మనమందర మేగుదము. మన సమక్షమున నా పెండ్లి యెట్లు జరుగగలదు? అప్పుడే విషయములన్ని యు తేలగలవు?"

"అందును వ్యర్థమే!"

"కర్తవ్యము?"

"నేనొక్కతనే పోవుదాన."

"అందువలన ప్రయోజనము?"

"కార్యవిఘ్నమే......కాని......"

"కాని యేమి?"

"కాని వారి శుభకార్యమునందు జోక్యము కలుగజేసి కొనకుండుటయే యుక్తమని గోచరించుచున్నది. నన్ను గూర్చియే గదా అతడు సౌఖ్యములకు వంశోద్ధరణకు తిలాంజలు లిచ్చినది. ఇప్పుడైనను సంతానసౌఖ్యమును బడయ గలడు."

"నే నట్లూరుకొనను. వివాహ మైనను యాపియే దీరుదును. ఇప్పుడేపోయి నాన్నగారితో చెప్పి ప్రయత్నించెదను."

"సరోజినీ! నా మాట విను. ఎవరితోను వెల్లడింపకుము. వివాహము కానిమ్ము."

"అట్లయిన నీగతి యేమికాగలదు?"

"భగవానుని కరుణ."

"నే నూరకొన" ననుచు వృత్తరముతో లోపలికి పో యింది.

అంబుజం ఒంటరిగా కూర్చొని "సాధుస్వరూపా! నీ సమభావమంతయు నెందుసమసెను? యువతులపైనా నీ యీర్ష్య! అబలలపైనా నీ అనంత బలపరాక్రమముల విజృంభింపచేయుట. వీరు నీకేమొగ్గొనరించిరి? నీ న్యాయ మంతయు నెందేగెను? వీక్షించుచుంటివా? ఈ మానవ జాతి చర్యలు! ఆలకించుచుంటివా? భర్తృ పరిత్యాతలగు అబలల ఆలాపములు! కాంచుము. అటు గాంచుము. కొండంత ఆసిక్తి ఆశపడి, రూపరేఖా విలాసములు లేక పోయినను, అయిదవ పెండ్లికి తొంబదియేండ్ల ముసలి పెండ్లికుమరునకు తమ చంటిబిడ్డల నిచ్చుటచే నా బాలి కలు పడు బాధలను?...ఆహా! మగవాని కెన్ని వివాహా ము లైనను నాడవచ్చునేమి? అక్షతయోనియైనను బాల విధవయైనను ఆజన్మ బ్రహ్మచారిణీత్వ మనుభవించ వలసి నదే? పాప ప్రదమగు రహస్యవ్యభిచారాభివృద్ధి కిది యే హేతువగుట లేదా? తమ సౌఖ్యముల కొరకై వారల కురూపిణులుగ తయారుచేసి భార్యలకు దాసీలుగా తయా రు చేసుకొనుచున్నారే?...... హే ప్రభూ! పరివర్తనము ప్రథమ కర్తవ్యముగాదా! నా కొరకని యనుచుంటివేమి?

పురుషుల పౌరుషమున కాహుతి యగుచున్న నావంటి జీవన్మృతలగు యువతీమణులెందరు లేరు? వారందరి దీనాలాపములు వినబడుటలేదా?...అవును ఎట్లు వినబడును? నీవుమాత్రము వారిజాతికే చెందినవాడవు గానా? నీ కెందరు భార్యలు లేరు? పరిపాలన నించుక మార్చి న్యాయమొనరింపుము!......అయ్యో! నా వ్రాతఫల మట్లుండ నిర్హేతుకముగ నిన్ను దూషించి దురిత మొండిగట్టుకొనుచుంటినే? నేను నీతో......!"

అమ్మాయీ! యిల్లారా అమ్మా! అంటూ తల్లి గాబోలు పిలిచింది.

## ౭

సాయంత్రం అయిదున్నర గంటలయింది. ప్రభాకరుడు పన్నని పట్టంచులధోవతి, పంజాబి సిల్కుషర్టు పైన బెంగుళూరు సిల్కు ఉత్తరీయం, చేతికి రిస్టువాచి, కళ్ళకు జోడు, కాళ్ళకు బూటు ధరించి కమ్మని సువాసనలు వెదజల్లుతూ విలాసంగా బొరబడ్డాడు వుద్యానవనంలోకి. అక్కడే ఒక తిన్నెపై యంబుజసరోజలు చదరంగమాడుచుండుటగాంచి తానొక తిన్నెపై యాసీనుడయ్యెను. సరోజిని గెల్చుటకు సిద్ధముగానుండెను. అప్పుడంబుజం—

"బావా! యీ యాట యొకసారి ఆడు" అన్నది.

ప్రభాకరుడు వచ్చి యాటను గెలిపించెను. ఇతడు గెలుచుటచే కోపము చెంది సరోజిని యటనుండి వెడలి పోయెను.

"అప్పుడే సూర్యుడస్తమించుచున్నాడే" అన్నది అంబుజం.

"చంద్రుడొచ్చాడుగదూ?"

"ఔను ప్రపంచమంతయు నస్థిరమయమే గదా?"

"అట్లుకాదు. స్థిరమైన వస్తువొకటి కలదు. దానికెట్టి పతనములేదు. అదియే నిష్కల్మష ప్రేమ."

"ప్రేమగూడ పరివర్తన మొందగలదు. లోకనియమములు దానిని నాట్యమాడించు చుండును."

"అంబుజం అట్లైన్నటికిని కాజాలదు. ఇటుచూడు మీ కమలముల ప్రేమను తేజోకిరణుడు కాపాడుచుండుట లేదా? శీతమయూఖుడు తన వినిర్మల శశికాంతిచే చకోరముల ప్రేమను పోషించుటలేదా? మొయిళ్లు తమ శీతల స్వాతి బిందువులచే చాతకముల ప్రేమను ప్రకటించుట లేదా?"

"కావచ్చును. అవి ప్రకృతబద్ధములు. నియమముల పాటించుటయే వాటి విధి. విధిని విడుచుటకు వాటికి శక్తి లేదు. మానవులన్నచో స్వతంత్రులు. వారి సౌఖ్యముల కొరకై నెట్టి కఠోరకార్య మొనరించుటకైన వెనుకంజ

వేయరు."

"అట్లొప్పుకొన జాలను. తన భార్యకై బహు బాధలు బొంది అగ్నిసాక్షిగ స్వీకరించిన ఆ రామచంద్రుని నిర్మలప్రేమ జూడుము. అటు నర్ధనారీశ్వరుని అనురాగమును పరికింపుము. భార్యకై తన యర్ధశరీరమునే యిచ్చెనే."

"అట్లనా! అగ్నిహోత్రునిచే అందివ్వబడిన లోకమాత సీతను నిండుగర్భిణి యనియైన మదినెంచక కఠిన హృదయుడై కాననములకంపిన కృపారహితుడు రాముడు ప్రేమపూరితుడా? అంతమున్నకైన పుత్రహీనుడగుటవలన, యౌవరాజ్యాభిషేకమున కాశపడి గ్రహించెనేకాని ప్రేమచేనందుమా? కుమారుని కొఱకైగదా ఆమె అందమునకు ఆశపడి అనుమతించినది హరుడు. దుష్యంతుని గాంచుము. ఎంతటిప్రేమ నెట్లుపరిహరించెనో? కడకు పుత్రహీనుడగుటచే ప్రేమపునరుద్ధరింప బడినది. నిజముగ పరికించిన ప్రేమ స్త్రీలసొత్తేగాని పురుషులవద్ద పూర్తిగా శూన్యము. తమ బాగోగులకై పురుషులు ప్రేమింతురు......!"

"స్త్రీలే నిజముగ ప్రేమించుట యెరుగరు. వారు తమప్రియుల ప్రాణములతో చెలగాటము లాడెదరు. 'పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటమ'న్నట్లు వారిని యమయాతన యనుభవింప జేయుదురు. పిల్లులవిధమున

తమ దెబ్బలచే పురుషుల ప్రాణపత్నుల అరవులచే ఆనం దించుచుందురు. పాపమా పత్నుల యాతనేదన యేమని చెప్ప వచ్చును. షాజహాను గాంచుము. ప్రపంచములో నికెల్ల చిత్రాతిచిత్రమైన భవనమును తన భార్యకై కట్టించెనే?"

"అక్కా! అమ్మ యెందుకో త్వరగా పిలుస్తుంది రా!" వెంటనే అంబుజం వెళ్ళిపోయింది.

అప్పుడే వాసకురియడానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి. సరోజిని వీణ నేర్పమని బలవంత పెట్టుతు న్నది అంబుజాన్ని. అప్పుడే అంబుజం ముక్త కంఠంతో అందుకుంది. ఆమె పాటకు తాళంవేస్తున్నయ్యా యన్న ట్లు "టప టప" పడుతున్నయ్ చినుకులు. పాట నిర్మల వాయుప్రవాహములలో గలసి అంతులేకుండా అంతరిక్షా నికి ఎగిరిపోతూంది. ఇంతలో కారు దిగి విషణ్ణముఖుడై వచ్చాడు శ్యామలరావుగారు. కూతుర్ని చూచునప్పటికి ఆగలా దుఃఖము. ఆయనకేగాదు ఎవరికిమాత్రం ఏం ఆగు తుంది చెప్పండి. పుత్రుడా! పుత్రదుఃఖమును పోసిపోయె గదా? ప్రథమ పుత్రిక విషయ మంటుమా? యిట్లయ్యె గదా! ధవుని గలిగియుండియు వైధవ్య మనుభవింపవలసి వచ్చె. నిరపరాధియైన నిర్మల మానినీమణి నిర్హేతుకముగ నిందింపబడి విసర్జింప బడినదిగదా! ఆ తల్లిదండ్రుల దుః ఖమాగగలదా? పాపము! భగవంతుడు ఆ సభర్త విధవ బాధల నెట్లు బాపునోగదా?"

౮

బాగా వికసించిన పూలల్లోంచి కమ్మని తావులు బయలుదేరుతున్నాయి. ఆహారాన్వేషణమునకై బయలు వెడలిన పక్షులు యిండ్లకు జేరుకుంటున్నాయి. ప్రొద్దు న్నుంచి యెడబాటున ఓర్వలేక పిలుచుచున్న లేగదూళ్ల కు సమాధానాలిస్తున్నాయి వాటి తల్లులు. కృత్రిమ వేష ధారులై తమ మాయాకుటిల దృక్ప్రసారములచే బంధిం ప కుతూహాలులై అప్పుడప్పుడే ఆక్రమించుతున్నారు గుమ్మాల్ని వేశ్యాంగనలు. మాతాపితల నిర్బంధాల నుండి తప్పించుకుని బయట పడుతున్నారు పిల్లలు తమ ఆటలకోసం. పగలంతా పాటుపడి కర్షకులు ఇళ్ళకు మళ్ళారు పొలాలనుంచి. అప్పుడే తన ప్రేమాంపు ప్రియు రాలిని ప్రేరేపించుటకు ప్రవేశించాడు ఉద్యానవనంలోకి ప్రభాకరుడు. అనుకున్నట్లుగానే అందింప సమయానికి అంబుజం ఒంటరిగా.

ఒక తిన్నెపై కూర్చొని పుష్పములో మధువును గ్రోలుచున్న మధుపమును గాంచి "మనుష్యుల ప్రకృతి కూడ యింతియే కదా!" యనుచుండెను.

అప్పుడే చాటునుండి "అట్లు తలచుట చాల పొర

పాటు సుమీ!” అని అందుకొనెను.

“ఎందువలన?”

“అందరు అట్లుండరు గనుక.”

“ఇది విశ్వాసార్హము గాదు.”

“విశ్వాస పాత్రముగ నొనరించెద నొప్పుకొందువా?”

“నేను వివాహ మాడకుండుటకు కారణమేమి?...”

“చెప్పుము. ఆలోచించెద వేల?”

“మన ప్రేమయేగదా!”

“అనగా......”

“నీ కొఱకై వేచియుంటిని.”

అంబుజం క్రోధముచే కంపించిపోవుచు “అట్లైనన్నటికిని కాజాలదు. ఒకనిసొత్తు మఱొకనికెట్లు సమకూరకలదు. నీ దురాశను వీడుము. నా పై ప్రేమను పోజూడుము. వేరొకయువతిని పరిణయమాడుము.”

“ప్రేయసీ! అంబుజం. ఇదియేనా నీ ప్రేమపాలన!”

“ప్రభాకరా! ప్రేయసీయని పిలువకుము. నే నెట్లు నీ ప్రేయసినగుదును. ‘ప్రేమపాలనా’ అవును నేను ప్రేమనే పాలించుచుంటిని. అగ్నిసాక్షిగా, వేదోక్తమంత్రములచే నెవని పరిణయమాడితినో అట్టివానినే ప్రేమించుచుంటిని. నేనాతనిచేగర్హింప బడినను, అతని అనురాగమున కపాత్రురాలనైనను, నన్నతడు పరిత్యజించినను

ఆతడే నా భర్త. ఆతడే నా ప్రియుడు. నా ప్రేమంపు రాశి."

"మంత్రములచే నీ బహిఃశరీరమునే ఆతనికి కట్టివై చిరి గాని మనసు స్థిరప్రేమచే గట్టిగా బిగింపబడిన నీ హృదయమును నర్పింప లేరుగదా! ఇంతకు పూర్వమే మనమిరువురము భూమ్యాకాశముల సాక్షిగా, సూర్యచంద్రాదుల సాక్షిగా, యీ కొలని సాక్షిగా, వాయువు సాక్షిగా, యీ వుద్యానవనం సాక్షిగా పావనతరమైన నా హృదయ సాక్షిగా వివాహమొనరించు కొనలేదా? నీ మనస్సున యోచించు కొనుము. ఈ ప్రకృతిగూడ అట్లే బోధించగలదు సుమీ! నీ విట్లు వ్యర్థముగ క్రోధమును గలిగించు కొనకు."

"కొంచెము కన్నులు విచ్చి గ్రహించుకొనుము నే నెవరి దాననో?"

"ఇతరుల కెట్లగుదువు? నా దానవే."

"జాగ్రత్తగ మాట్లాడుము. నా వివాహమై చాల కాలమైనది. ఇప్పుడు నేను పరస్త్రీనైతిని. పరస్త్రీల అతిగ పల్కరించ గూడదు."

"ఏమి! నీవు పరస్త్రీవా! ఎట్లగుదువు? ప్రపంచమున కనుక నీవు నా దానవని. మన బాల్యచేష్టలు జ్ఞప్తికి తెచ్చుకొనుము. మన మిరువురము సౌఖ్యముగ గడిపిన ఆ రోజులు, ఆ రాత్రులు, మనము ఇంటర్మీడియట్ చదువు

చున్నప్పుడు సలిపికొన్న ఆ ప్రమాణ వాచకములు, ఆ ప్రేమ ప్రసంగములు, మన భావిజీవన కల్పనలు కన్నెత్తి పరికించుము......? ఇప్పుడైనను తెలిసినదా నీ వివాహ మెవరితోనయినదో? నీకే కాదు. ప్రపంచమునకే కాదు. భగవంతునకుగూడ మనమిరువురమొకటిగానె యుందుమనే యభిప్రాయము. అందువలననే యీ పరివర్తనము గలిగి నది......! చూచుకొనుము నీ మనస్సును పరీక్షించి. చూచుకొనుము. నీ హృదయము నిన్ను శపించుటలేదా? నీ ఆత్మ నిన్ను నిర్బంధించుటలేదా? నీ వంచనయే నీ కానంద దాయకమా? (అంబుజం చేతులుపట్టుకుని) నీవీ ప్రస్తుత పరిస్థితుల మరచిపొమ్ము. మన పూర్వప్రేమను స్మరించి నీ వచోమృతధారలచే నన్నానందడోలికల నూగించుము. నడువుము. మన జీవిత మెచ్చోట ప్రశాంతముగ, కీర్తియుతముగ గడుపగలుగుదుమో యచ్చోటకేగుదము రమ్ము. నీవు నా ప్రేయసివి కావని యెవ్వరు పోరగలరు. యీ మాయా ప్రపంచముల నియమముల పారద్రోలుము... ఇటు చూడుము. మన బాల్యప్రవర్తనముల పరికింపుము. చూచితివా? మనల యీ క్రూరప్రపంచము వేరుపరుప యత్నించుచున్నది. మన హృదయమందు జిగిబిగిగ యల్లుకొనిన ప్రేమలతను మొదలంట పెరికి కోయుచున్నది. రమ్ము! నిన్ను నా హృదయములో శాశ్వతముగ దాచుకొందును. త్వరగా రమ్ము. 'ప్రేమపాలన' చేయుము."

అనుచు కౌగలించుకొనుటకై చేతులు జాపుచు ముందున కంజవేసెను. ఆమె తొందరతో వెనుకడుగిడెను. ప్రభాకరుడు దానిని పాటించకుండా ప్రేమోద్రేకుడై యామెను స్పృశింప వేగిరపడుచు వెంటనంటెను. ఆమె యత్నమంతయు విఫలము కాజొచ్చెను. ఆమె కేమియు దోచలేదు. మానరక్షణకై వెంటనే దగ్గరనున్న కొలనిలో యురికెను. వెంటనే ప్రభాకరుడు గూడ యందు దుమికి యామెను రయుద్ధునకు ప్రాణములతో చేర్చగలిగెను. వెంటనేయామె తెలివొంది "ఛీ! నన్నంటకుము. నన్ను మరణించనిమ్ము."

"ఎందుకొరకు?"

"ప్రేమపాలన కొరకు. నా మానసంరక్షణకొఱకు."

"నీవెవరిపాలన గోల్పోనుంటివి?"

"నీ వలననే?"

"నీ కీర్తి యిక్కట్టులకు కారకుడనైన నేను మరణించినచో"

పాపం అంబుజానికి జాలికలిగింది. సరస వచనములతో సాధించ సమకట్టింది. జ్ఞానోపదేశము చేయుటకు పూనుకొన్నది. "సోదరా! ప్రభాకరా! నీ చెప్పినదంతయు సత్యమే. మనము చదువుకొనునప్పుడు మన భావిజీవితమునకై యేర్పఱచుకొనిన ఆకాశహర్మ్యము లన్నియు నిజమే. మన ప్రేమ యదార్థమే. కాని మన దేశము హిందూదేశము. మనము హిందువులము. ఆంగ్లేయ భాషాప్రవీణుల

మైనంతనే ఆంగ్లేయాచారముల మనమెట్లు స్వీకరింతుము. ఆర్య ఆచారముల ననుసరించి నాకు వివాహమైనది. అతడు నన్ను పరిత్యజించినను, అతడు రెండవవివాహ మొనరించు కొనినను అతని పాదసేవయే పరమ కర్తవ్యము. మనకు "సీత, సావిత్రి, దమయంతి, సతి" మొదలగు పతివ్రతామతల్లులే ఆదర్శప్రాయురాండ్రు. (సరోషముగ) మన మిరువురము బాల్యస్నేహితులము కానిచో నీవు నాకు విద్య నేర్పకయుండినచో, నాయందు పూర్వపు పతివ్రతల శక్తి యున్నచో నిన్నిప్పుడు శాపము చే నశింప చేసి యుందును. (అసహ్యాభావముతో) ప్రభాకరా! నీవీ అస్థిరసౌందర్యముపై ఆశపడి, పాశ్చాత్య భూతమునకు లోబడి యిట్లు ప్రవర్తించుచుంటివి. పారదోలు మా పాశ్చాత్యభూతమును నీ హృదయమునుండి. కన్నులు విచ్చి యిప్పుడుగాంచుము. నేనెవరిస్త్రీనో! నేను నీ మోహపాశమున దగుల్కొందునని యూహించకుము. అజ్ఞానాంధకారముచే ఆవరింపబడిన నా జీవితమున జ్ఞానజ్యోతిని వెలిగించవలసిన నీవే యిట్లు నా నేత్రముల మూయజూచుటతగునా? మంచి మార్గోపదేశమునకు మారు కఠోర కంటకములచే నావరింపబడినమార్గమున ప్రవేశింపచేయు ప్రయత్నించుట భావ్యమా! (కొంచెమాగి) బాల్యమునుండియు నా స్నేహముచేసినను నా హృదయమును గ్రహించలేకుంటివే? వివాహితనైన నన్ను నీ భార్యగా తలంచు

చుంటివే? "విద్యావిహీనః పశు" వను మాటను వ్యర్థము చేయుచుంటివే? ఇంతలో ఇట్టి మూర్ఖుడ వైతివే? (శాంతస్వరముతో) నే చెప్పినది ప్రేమించుట పాపముగాదు. ప్రపంచంలోని వస్తువులలోనెల్ల ప్రేమయే స్థిరమైనది. అందరును ప్రేమించవచ్చును. నీవు నన్ను ప్రేమించవచ్చును. నేను నిన్ను ప్రేమించవచ్చు. ఇందుదోషమేమియు లేదు. ప్రేమించు నన్ను. నేను నిన్ను ప్రేమించుచున్నాను. సోదరీప్రేమతో నన్ను కన్నెత్తి పరికించుము. (అతని చేతులు పట్టుకొని) నన్ను నీ సోదరిగ భావించి నా స్థితిని కనుగొనుము. నిరపరాధిని నగు నన్ను వాసిపై లేని యపనిందను మోపి నన్ను పరిత్యజించి రెండవ వివాహము గావించుకొనెనే? సర్వసౌఖ్యప్రదమగు నా పథమును కంటక భూయిష్టముగ నొనరించెనే? నా హృదయమును చీల్చివేసెనే? నన్ను వ్యభిచారిణియని దూషించెనే? (కన్నీరు కార్చుచు) ఇన్ని విధముల ఆందోళనలచే, అవస్థలననుభవించు నన్ను నీవుకూడ యిట్లు కష్టపెట్టుట న్యాయమేనా? నేను నీ సోదరినిగానా? సోదరికష్టములు గాంచుటచే నీ హృదయము కరుగుట లేదా? ఇహపరలోకములకుగూడ దూరముచేయుచుంటివే? ప్రజలు నన్నుగూర్చి చెప్పుకొను పలుకులకు తలెత్తికొనుటకైనను నాకు సాహస మొదవుట లేదే? (చింతాభరముచే) నీవు ఎంతటి నిర్దయుడవై పోతివి. ఇదియేనా! ఇంతసేపటినుంచి నీవు

చెప్పుచున్న 'ప్రేమపాలన'! దీనినే గాబోలు ప్రేమయం
దురు. నీవు ప్రేమను కూడ కళంకిత మొనర్చుచుంటివే?
(కోపముతో లేచి) ఛీ! దురాత్ముడా! పొమ్ము! నా యెదు
టనుండి దూరముగ తొలగిపొమ్ము. పోనిచో యీ కటా
రితో నా రక్తములో నీ రక్తము గలిపెదను." అనుచు
పిచ్చియెత్తినదానివలె కత్తినిదీసి "పరమాత్మా! నన్నీ
కష్టములనుండి తొలగించి నీ పాదసన్నిధికి జేర్చుకొమ్ము"
నుచు పొడుచుకొనెను. వెంటనే యీ కత్తినిలాగి డాక్టరు
ప్రభాకరుడు ఆ రక్త ప్రవాహమును ఆపివేసి కట్టుకట్టెను.
తిరిగి కటారినిగొని "ఈ దురితాత్మునికి తగిన ప్రాయశ్చి
త్తమాగాక......! రుధిరపిపాసా కాంక్షితవైయున్న యో
కటారమా! త్వరగా నీ రక్తముతో నీ కడుపునింపుకొను
ము" నుచు కత్తితో పొడుచుకొనబోవుచుండెను. అంబు
జం మనోవేగంతో లేచి యీ కత్తిని లాగుకొని చెరువు
నందు విసరిపాఱవైచెను. అతని చేయిపట్టుకొని "ఆత్మ
హత్య మహాపాపమని తెలియదా? అయినను యిదిపిరికి
పందలపనికాని యెప్పటికిని ప్రాయశ్చిత్తము కానేరదు.
నిశ్చల ప్రేమతో భగవంతుని భజింపుము. అప్పుడు భగ
వంతుడే నిన్ను క్షమించును" అని చెప్పగానే ప్రభాకరు
డు నిశ్చింతాంతరంగుడై యిట్లనియెను.

"అంబుజం నీవెట్టి 'ప్రేమపాలన' కై నీ పూర్వప్రేమను
పోనాడితివో, నే నట్టి ప్రేమపాలనకై యే నా పూర్వ

ప్రేమను పునరుద్ధరించు కొనుచు స్వార్థత్యాగినై నా జీవి
తాంశమును భగవత్సేవలందిల్లే గడుపగలవాడ" ననుచు
ప్రతిన చేసి యామెకు నమస్కరించెను. వెంటనే అంబుజం
అతనిని కౌగలించుకొని కన్నీటిచే నాతని నభిషేకించుచు
విడువలేక విడువలేక వదలివేసెను.

"నేను తపస్త్యాగ్నిచే నా పాపపుంజముల భస్మీభూత
మొనర్చుకొనుట కేగుచున్నా" ననుచు వెళ్ళిపోయెను.

## ౬

సాయంత్రం మూడుగంటలవుతుంది. సరోజిని
స్నేహితురాండ్రతో కలసి యెచటికో పోయెను. అంబు
జం ఒంటరిగా కూర్చొని యేవో పుస్తకం చదువుకుంటూ
వున్నది. ఆమె మనస్సుకేమి తోచిందో పుస్తకమువతల పార
వైచెను. ప్రేమోద్రేకమున పెనుగులాడ జొచ్చెను. ఆమె
మనస్సున కెన్నియో తలపులుగలిగెను. ఎన్నిటికని ఓర్చు
కొనగలదు. సమస్త మానవకోటిని భ్రమింపజేయగల
సుందరస్వరూపము. పూవిలుకానినైను పూర్తిగ వశపర
చు కొనగల లావణ్య యౌవనము. కోరినంత విద్య. ఇవి
యన్నియు వ్యర్థమేగదా! విచారముచే నామె [illegible]
మై పోవుచుండెను. "ఇక నా జీవితమున చేయదగినదేది?

నే నెట్లు నా కాలమును గడుపగలుగుదును." వెంటనే తన
భర్త నుంచి వచ్చినయుత్తరము జ్ఞప్తికి వచ్చెను. "అయ్యో!
అతనితో యథార్థమంతయు నివేదించుటకైనను వలనుపడ
కున్నదే. నాపై నెట్టి యపనింద నిల్పినాడు.........!
చెప్పినను వాటిని విశ్వసించునా? అప్పుడు నా జన్మము
వ్యర్థమేగదా! పూర్వము సీతామహాదేవిని తన గర్భమున
దాచుకొనినట్లు నన్ను గూడ తన గర్భమున దాచుకొను
నేమో......! అయ్యో! యెట్టివెర్రి. లోకమాతయైన
జానకి యేడ! మానవమాత్రురాలనైన నే నేడ! నా కంతటి
భాగ్యమా! అట్లు తలచుటకైనను నాకు శక్తి చాలదే?
కానివమ్మ! జీవించియుండినచో......! పతిని గలిగి యత
నిచే విడువబడిన నన్ను లోకము దూషింపదా? ఇట్టి అప
కీర్తి పొందుటకన్న మరణము శ్రేయము గాదా? ఆతడు
మరల స్వీకరించునను మాట కల్ల. రెండవ వివాహము
గూడ గావించుకొనెను గదా! ఇక కర్తవ్యము ఆత్మహత్య
గావించుకొని సౌఖ్యముల చూరగొనుటయే. అయ్యో!
ఆత్మహత్య అతి పాపప్రదమని వినియుంటిమే? యేమో
నరకమును గాంచుచుంటిమో? ఈ బాధకన్న ఆ బాధ
యెక్కువగ నుండునా? ఎవరు చెప్పగలరు? ఈ బాధను
భరించుట చాల బాధకరముగ నున్నది. భరించ నశక్య
ము" అనుచు ఉన్మత్తినియై తోటలోని బావిపైకి బోయి
నది. అందు తొంగి చూచినది. నీరు లోతుగాను, నిర్మల

ము గాను అగుపడెను. దూకుటకు ధైర్యము చాలలేదు. "అకాలమృత్యువు వాతపడవలసి వచ్చినది. ఎన్ని సంపద లున్న నేమి? ఎంత విద్యయున్న నేమి? ఎంత సౌందర్యము న్న నేమి? కానిమ్ము! సరోజినీ! ఈ వార్త మాత్రము తెలు పాలి సుమా! అమ్మో! చాలలోతుగా నున్నదే? చూచు చు, చూచుచు దూకుట యెట్లు? భయము వేయుచున్నదే? ఊహూ! దూకియే తీరవలయును. ఈ పని చేయలేనిచో నే చేయగల్గిన దేమి? ఇక దూకెద" ననుచు వస్త్రమును సవరించుకొను చుండెను. నూతిలోనికి యొక గొలుసు వ్రేలాడుచుండెను. ఇంతలో వెనుక మనుజుల యలజడి యయినట్లుండెను. అంబుజం ఆలస్యం చేయకుండా వెం టనే నూతిలోకి దూకింది. సరోజిని గాంచినదీ దృశ్యమును. ఆమె కేమియు దోచలేదు. వెంటనే యామె ఆ గొలుసు ద్వారా నూతిలోనికి దిగెను. అప్పుడే అంబుజం మునిగి పైకి తేలెను. వెంటనే యామె చేతిని పట్టుకొని సరోజిని "అక్కా! నీవు పైకి యెక్కుము. లేనిచో నేనుగూడ నీతో మరణించెదను."

తప్పనిసరియైనది. ముందు అంబుజం తర్వాత సరో జిని పైకివచ్చారు. నాటినుంచి యామెను విడిచి యెవరూ ఉండేవారు కారు. నాటినుంచి అంబుజం తండ్రి సేవలం దు నిమగ్న కాజొచ్చెను. శ్యామలరావుగారు గూడ ఎల్ల ప్పుడును యింటిలో యుండుచు ఆమె యేది చేయుమనిన

నదియే చేయుచు ఆమెకు ప్రియమును గూర్చుచుండు వాడు. అతడు గానప్రియుడు, కవిత్వము చెప్పుట గూడ తెలిసినవాడు. సంస్కృతమునందు కొంచెము చొరవుంది. ఆమె కయిష్టమైనను తండ్రి ప్రీతికొరకై వీణ పాడుతూం డేది. ఈమె గానామృతముచే లోకాతీతమైన సౌఖ్యమును పొందినట్లానందించేవాడు.

ఇప్పుడామె మనోవేదన యణగిపోయినది. తండ్రి నుంచి వేదాంతోపదేశమును పొందుచుండెను. ప్రశాంత జలరాశివలె గంభీర హృదయముతో చింతాశూన్యమై తరంగశూన్య నదివలె సౌఖ్యంగా గడుపుచున్నది కాలం.

## ౧౦

బొమ్మల పండగ పదిరోజులుంది. అందఱు ఇళ్ళ కు వెల్ల వేయిస్తున్నారు. నారాయణ మూర్తి యింట్లో గూడ శ్యామల పటములన్నీ తీసి బాగు చేస్తూవున్నది. ఇంతలో యెక్కడ నుంచో "అమ్మా! ఈ అలమాల నే తీత్తా!" అంటూ వచ్చాడు.

"నాయనా! నీవు ముట్టుకోనకు. పగిలిపోతాయిరా!" అంటూతానే తీస్తున్నది. ఈ సందట్లో యెక్కడనుంచి లాగాడో యొక ఫొటో లాగాడు. "అమ్మా! ఈ బొమ్మ

లెవలే? ” అనిఅడిగాను. ఆమె దానినిచూచి “పాపము! మా అక్క కెట్టి యవస్థతటస్థించినది. ఇట్టి సౌందర్యవతి, విద్యావతి, గుణవతి నాకు అక్కగా లభించునా? ఆమెకు సేవచేయుచు సంతోషముగ కాలము పుచ్చుకొందునే?”

“అమ్మా! ఎవలే? చెప్పవేం? అత్తా తూత్తావెందుకే?”

“ నాన్నా! ఈమె సీరాణి అమ్మరా! ”

“ లానీ అమ్మా! ఎక్కలుంది? ”

“ వాళ్ళ వూరిలోవుంది నాయనా! ”

“ ఇక్కలకు లాదేం? ”

“ తీసుకొనివస్తే వస్తుంది. ”

“ ఎల్లతం ఎత్తా? ”

“ రైలుబండిమీాద?”

“ రైలు బండిమీాదా? నే యెల్లి తీతుకులానా? ”

“ నీ వొక్కడవే పోలేవు. నాన్నగారితో వెళ్ళుదువు గానిలే. ”

వెంటనే నాన్నదగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళినాడు. ఆ పటమును చూచుచు, “ సోదరీ! నాపై కోపగించుకొనవద్దు. నేను నీ పూజ జేయ గోరుచున్నాను. సాధారణముగా సవతులప్రేమను నీచముగ పరిగణింతురు. అది యిప్పట్ల వ్యర్థముసుమీా? నా ప్రేమను నీ కెట్లు తెలియ పఱతును. నీ వొకసారి యేతెంచి పరీక్షించి చూడుము. నిన్నెట్లు పూజింతునో? నా ప్రేమప్రకటించుట కేయుపా

యమును గోచరించుటలేదే? ఈ పుత్రుడు నీ పుత్రుడే! నీ కీర్తి దేశదేశముల వ్యాపించుచున్నదే. నీ చెలియునై స్వర్గసౌఖ్యముల బడయుచునే? రమ్మా! ఒక్కసారిరమ్మా! ఆహా! ఏమి యీ సౌందర్యము! ఏమి యీ గంభీరత! ప్రతియంగము ప్రేమపూరిత మానట్లగుపడుచున్నదే? నా భాగ్యమెట్లున్నదో?......"

"శ్యామా! పీనిని నాపై నిట్లుప్రయోగించితివేమి?"

"నాన్నా! నన్ను లానీ అమ్మ దగ్గరకు తీసుకొనెల్తావా? ఎల్లవా?"

"ఎక్కడున్నది?"

"అతున్నది. లేలుబండిమీద తీతుకొనెల్లు"

"తీసుకొనివెళ్ళితే నీవు అక్కడ యేంచేస్తావు నాయనా!"

"లానీ అమ్మను యిక్కలకు తీతుకొనివత్తా"

"ఇక్కడ కెందుకు"

"మా లానీఅమ్మగాదూ"

"ఇదిగో మీ అమ్మ!"

"ఇది మా అమ్మ గాదు. లానీఅమ్మే మాఅమ్మ. ఎప్పుడెలాం."

"రేపు వెళ్ళుదములే!"

"లోదూ, లేపేనా!"

"అయితే ఏడికి రోజూ ఇట్లా జ్ఞాపకం వస్తుందే. ఎప్పు

డుచూడనైనా చూడలేదు." అంది శ్యామల.

"నేర్పు తేసరి"

"అవును, అట్టి స్త్రీమూర్తిని, అట్టి సుందరస్వరూపిణిని అట్టి సుగుణరాశిని యోగినిగా తయారు చేసితిరా? ఆమె యెట్టి యవస్థల ననుభవించుచున్నదో గదా! నేను మీకు ఎన్నిరోజులనుంచి చెప్పుతున్నాను ఆమెను తీసుకొని రావలసినదని. ఆమె నెప్పుడు చూచెదననియు, ఆమె కెప్పుడు సోదరివలె సేవచేయుదుననియు, నా మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. ఆమె కీర్తి వినినకొలది నాకుద్రేకము హెచ్చుచున్నది."

"అవును రానంతవరకు రాలేదని పుబలాటం. వచ్చిన తరువాత సపత్నుల పోరాటం బాగానే వుంటుంది."

"అది ప్రపంచకపు స్వభావము కావచ్చును. కాని ఆమె మంచితనము వినినచో చాల ఆనందము కలుగుచున్నది. నాకును తెలసినది. మీరు ఆమెకు సేవకులై యామె నేత్రాంచలముపై నాట్యమాడిన వారు కారా? అటువంటి వారిప్పుడు ఆమెను జ్ఞప్తి యందైన నుంచుకొనుచుంటిరా? నాకే పుత్రులు గలుగనిచో నా గతి గూడ యట్లే యయ్యెడిదిగదా? మీరు నన్ను వివాహము చేసుకొని యామెను పరిత్యజించుట యే మాత్రము తగిన పని గాదు. దీనిని బట్టియే పురుషులు చాల నిర్దయులని చెప్పవచ్చును. అట్టి విద్యావతియైన సోదరితో సౌఖ్యముగ గాల

ము గడుపుదునని ప్రతిజ్ఞాపూర్వకముగా చెప్పుచున్నాను త్వరగా రూపెను తీసికొనిరండి! ” అని చెప్పుచు శ్యామల వంటయింట ప్రవేశించెను. అప్పుడు నారాయణమూర్తి యొంటరివాడయ్యెను. ఇక ఆలోచించ సాగెను—

“ అంబుజం! ‘తోకత్రొక్కిన త్రాచువలె’ సమయమునకు వేచియున్నావు గాబోలు! పాపికి తగిన ప్రాయశ్చిత్తమే యయినది. ‘ పయోముఖ విషకుంభము వలె ’ నీ దుర్మార్గమును దాచి మంచిని చాట చూచు చున్నావా? పాపం! శ్యామల పిచ్చిది. అమాయకురాలు. నీయంతటి గడసరి గాకపోవుటచేతనే నిన్ను తీసికొనిరమ్మని బలవంత పెట్టుచున్నది......! అయితే నీవిప్పుడెక్కడున్నావు? తండ్రిగారి యింటియొద్దనే వున్నావు గాబోలు. కృష్ణమూర్తి మాట యబద్ధమా......! నీ కతనిపై ప్రేమ లేదూ! చాలా ఆశ్చర్యకరంగా వున్నదే? నీవు నిజంగా నిరపరాధివేనా? సరోజిని లేఖా మూలమున వాదిస్తూనే యున్నది... ...! తప్పక యిది యంతయు కృష్ణమూర్తి కృత్రిమమే! స్వలాభపరుడై నీ జీవితమును వ్యర్థ మొనరించుటకు పన్నిన పన్నుగడయేమో? (విచారముతో) సారధి గూడ యామెపై యేడ్చుచున్నాడెందులకు? ఆలోచించిన కొలది అంతు దొరుకుట లేదే? కృష్ణమూర్తికి యామెపై ద్వేషము ఎందులకు? ఆమె యతనికే మపరాధ మొనరించెను వాడిట్లొనర్చుటకు......ఏమో! ఏమియు పాల్పా

దుట లేదు......ఆహా! ఆమె సౌందర్యము, ఆమె విద్వత్తు, ఆమె ప్రేమ, ఆమె గానము ఇప్పటికి నా కన్నుల యెదుట మూర్తీభవించి తాండవమాడుచున్నట్లున్నవే" ఆహా! ఆ నిష్కళంకమూర్తి దీనాననయై నన్ను పలుకరించుచున్నది. నిజముగా నామెయే దోషిగానిచో నా పాపమునకు ప్రతి ఫలము......నేను వెళ్ళి తీసుకురావలెను...... ...! ఆ ముఖమును, ఆ తేజోమయమగు నా ముఖమును నే నెట్లు గాంచగల్గుదును? నాకు శక్తి యున్నదా? తలచు కొన్నచో గుండెలు ప్రయ్యలగుచున్నవే? చేసేపని!..."

"నాన్నా! నే తీసుకొస్తా లావే లాసీ అమ్మను" అంటూ కౌగలించుకున్నాడు.

౧౧

నాడు భోగిపండుగ ప్రతి గృహంలోనుంచి కమ్మని వాసనలు బయలుదేరుతున్నాయి. ప్రతిగృహము చక్కని అలంకారాలతోను, నూతన బొమ్మలతోను నిండి కళకళలాడుతోంది. అప్పుడే నారాయణమూర్తి బొమ్మలవద్దనున్న యొక ఫొటోతో గదిలో కూర్చుని యాలోచించుచుండెను.

"ఎట్టి సుందరరూపము. కాని 'గోముఖవ్యాఘ్రము ముగదా!' ఎట్టి సౌందర్యము, ఎట్టివిద్యయున్న యేమి ప్రయోజనము? అతనిపై నట్టిప్రేమ యున్నచో నాతని నెందులకు వివాహమాడకూడదు? ఆటంకపఱచినది యెవరు? వారినే యననేల? నా తెలివితేటలేమైనవి? వారి బాలప్రవర్తనలు, వారి ప్రేమప్రసంగములు, వారి యుద్యాన వనవిహారములు, వారి వేషభాషలు, వారి చర్యలు అన్నియు తెలిసియు 'అడుసు త్రొక్కనేల, కాలుకడుగ నేల?' యన్నట్లు ఆ సంబంధమున కెందుకియ్యకొనవలె? ఓ పాపినీ! నీవెంతటి మాయలమారివైతివే? నాపై కపటంపు ప్రేమజూపి నన్ను వలలోవేసికొని యెట్లాడించితివి? ఇపుడెటులున్నది? నీ యాటబాగున్నదా? నా యాటబాగున్నదా?...... చాలు నీకా ప్రాయశ్చిత్తము. సరియైన ప్రాయశ్చిత్తమే జరిగినది. ఛీ! నీ ముఖమైనను చూడరాదు. పో! నావద్దనుండి యవతలకుపో" అనుచు నా పటమును విసరిపారవైచెను. అది ముక్కలు ముక్కలయ్యెను. ఇంతలో "నాన్నా! అమ్మ లమ్మంతూదే?" అంటూపిలిచాడుసారథి. ఈ శబ్దంవిని యామెవచ్చి చూచి "గాడిదా! దీనిని పగలగొట్టావా" అంటూ వీపుమీద యొక దెబ్బవేసింది.

"నిరపరాధికా నీ శిక్ష!" అన్నాడు నారాయణమూర్తి.

"అంమలకు పాత్రులు మీరే, నే కాదు" అన్నది వెంటనే ఆలోచించకుండా. పాపము! హృదయం మీద యొక పిడుగు పడ్డట్టయింది. ఇంకేమీ మాట్లాడలేదు.

*   *   *   *   *

భోజనాలయినాయి. సాయంత్రం మూడున్నర గంటలయింది. సారధికి లాగు, చొక్కా, బూటు తొడిగి హెయిరాయిల్ రాసి దువ్వి, చక్కని చుక్కపెట్టి ఆడుకొనుటకై పంపించుతూంది.

"దృష్టి తగులునేమో! పంపవద్దు" అన్నాడు. కాని సారధి మాటవినకుండానే పరిగెత్తాడు. రాత్రి అన్నలతిన మంటే తల నొప్పిగావుందని పండుకొనెను. ఒక రాత్రికి మంచి జ్వరము వచ్చినది. "అనుకున్నంత అయినదని" యిద్దరు రెప్పవాల్చకుండా కూర్చున్నారు తెల్లవార్లూను. జ్వరము నానాటికి హెచ్చుచునే వచ్చినది. అది కుగ్రామ మగుటచే నచ్చట నెవరును మంచి వైద్యులు లేకుండిరి. చాల బలహీన స్థితిలోనికి వచ్చెను. నారాయణమూర్తి కి యేమియు తోచుటలేదు. నా సర్వస్వము సారధే గదా యనుచు విలపించుచుండెను. నాడు నూటనాలుగు డిగ్రీల జ్వరమువచ్చెను. కుర్రవాడు పసన స్పృహలో లేడు. ఉండి ఉండి, "లాసి అమ్మా!" అను మాట తప్ప మరేమియు మాటాడుటలేదు. శ్యామల రొమ్ము బాదుకొనుచు నేడ్చుచుండెను. ఆశలన్నియు నుడిగినవి. నారాయణమూర్తి

నిరాశుడై యొక మూల యొదిగి కూర్చొని యుండెను. శ్వాస కలిగినది ఇక బ్రతుకుటదుర్లభము. ఇక గడియలలో నున్నదనుచు వచ్చిన వారనుచుండిరి. ఇంతలో యెక్కడ నుంచో వచ్చాడు ఒక సన్యాసి. అతడు వచ్చి చూచి మీ కేమియు భయములేదు. అతనికి ఏ యాపదయును లేదు. అనుచు తనవద్దనున్న ఒక సీసాలోని ద్రావకమును అతని నోటిలో పోసెను. పావుగంటకు శ్వాస అణగిపోయెను. అప్పటినుంచి యతనే మందు వాడుచువచ్చెను. ఇతడప్పుడు బయలుదేరి పోవయత్నించినను ఇప్పుడుగాదు జ్వరము పూర్తిగ తగ్గిన తరువాత నేగవచ్చుననుచు బది దినములాపిరి. ఇతను వెళ్ళుటకు పూర్వము నారాయణమూర్తికి భూత భవిష్యత్తులు ప్రభాకరుని వృత్తాంతము వినిపించి యేగెను.

ఇతడేగిన తరువాత నారాయణమూర్తి మంత్రబద్ధుడైన వానిరీతి, పిచ్చివానిభాతి సంచరింప మొదలిడెను. "అంబుజం! నీవు నిరపరాధినివా? నిరపరాధినిపై సందాప నిందయా! ఇంత కఠిన శిక్షయా?......అంబుజా నిన్ను హింసించిన పాపము యమపాశమువలె నా ప్రాణముల బిగించివేయుచున్నది. ఆ సాధ్విపై నెట్టి యపనింద మోపితిన్ని......ఏమని చెప్పెను. ఇది యంతయు కృష్ణమూర్తి కుత్సితమనియా!... ...కృష్ణమూర్తి కుత్సితమా! లేక సన్యాసిదా? కృష్ణా! నీవేనా సర్వనాశన మొనరించితివి?

నా పెన్నిధిని పెరికివేసితివి? నన్నిట్లు మోసపుచ్చితివి? యే మని చెప్పితివి? సంతానహీన యనియా? ఆమె సేవలోన రించదనియా? బాగున్నది. బాలికకు సంతానమా! నీకు అట్లు చెప్పి నొప్పించుటకు నీ నోరెట్లాడెరా? ఇప్పుడు నీ వగపడినచో నేనేమి చేసియుందునో తెలియునా?......
(చేతులుజోడించి) హా దేవీ! కృపాప్రసాదినీ! నేను నిన్ను నిర్హేతుకముగ పరిత్యజించినందులకు నన్ను శపించి నరక ములనుభవించునటుల చేయుము. అప్పుడుగాని నా పాప ములకు ప్రాయశ్చిత్తము గలుగనేరదు. అంబుజం! ఏమి చేసితిని? నా ప్రేమంపు రాశివగు నిన్ను పాపాత్మురాల నుగ నొనర్చి వదలి వేసితిని. నీ కోమలహృదయమును కటారిచే పొడిచివేసితినే! (కొంచెమాలోచించి) నన్నేల దూషించుకొన వలయును? ఇదంతయు పురాకృత కర్మ ఫలమే! పూర్వము ఆ రాముడు, దుష్యంతుడు, నలుడు మున్నగువారందరు పతివ్రతామణులయిన తమ భార్యల నిర్హేతుకముగ వదలి కొంతకాలము గడుపలేదా? వార ట్లొనరించుటచే వారిని మనము దూషించు చున్నామా? అవును. నేను వారివలెనే పురుషుడను. నాకు వారివలె యాలోచనాజ్ఞాన మున్నది. నే పిరికిపందను గాను. నా యాత్మగౌరవరక్షణార్థమై నేనట్లొనర్చుట వ్యర్థము కానే రదు. ప్రేమపూరితయైన శకుంతలను నిండు సభలో యవమానపరచలేదా? పవిత్రమాతయైన సీతను రాముడు

అడవి కంపలేదా? నేనొనరించుటలో గూడ తప్పేమాత్ర మును లేదనవచ్చు." ఈ యాలోచనతో నింటికి జేరెను. తన గదిలోనికి పోయి కూర్చుని "అంబుజం! నేను నిన్ను పొందుట కర్హుడను గాను. నీ వనుకొనుచుందువు నేను సుఖించుచుంటి నని. ఊహించకుము. నిరపరాధినిని నిం దించితి ననుమాట హృదయ కంటకమయి బాధించుచు న్నది. పంచాగ్ని మధ్యమునబడి పరితపించు చుంటిని. నన్ను మాత్రమెవ్వరును ఆదరించుట లేదు. నేను మాత్ర మీా సారధిని, శ్యామలను జూచుచు జీవిస్తున్నా. వారో అంబుజాన్ని చూచి......అయితే నేతప్ప అంబుజం అం దరకు ప్రేమపాత్రురాలే నాకు తప్ప!......ప్రభాకరా! నీవు నీ స్వల్ప అపరాధమునకు ఇంతటి కఠినవ్రత మూను టా? అనంతమైన ఆదాయమును, నిరుపమానమైన సౌం దర్యమును, అంతులేని నీ కాంక్షలను, వదలివేసి 'యోగి' వైతివా? అడవుల తిరుగుచు కాయకసరును తిని జీవించు చుంటివా? అతులిత సౌఖ్యసంపద లనుభవించు నీవు విరా గివై సమస్త కష్టముల కోర్చి, ఎండవానలకు విసుగుచెం దక పరోపకారార్థమై, ఆదర్శప్రాయుడవై, నీ శరీరమును వినియోగపరచు చుంటివా? ఆహా! ఏమి నీ ప్రేమపాలన!' నేనో! ఛీ! పాపినై, స్వార్థపరుడనై, కార్యాకార్య జ్ఞాన శూన్యుడనై, పాపపర్వతముల ప్రపంచమున్న పాదుకొల్పు చుంటినా? అరే! నీ......!"

ఇంతలో సాగధివచ్చి "నాన్నా! అమ్మ అన్నానికి లమ్మంతుందే?" అన్నాడు.

"కాశమ్మ ఏమైనసరే! రేపు బయలుదేరి వెళ్ళవలెను" అని అనుకుంటూ లోపలికి వెళ్లెను.

౧౨

మనము సామాన్యంగా రోజులొక్క విధంగా నడుపవంటాం. నిజంగా ఆలోచిస్తే కాలం ఎల్లప్పుడు స్థిరమైనదని నశించనిదని రూఢిపడుతుంది. దానికి మార్పు లేదు. కాని దానికితరులను చలింపజేయగల శక్తి మాత్రము గలదని యొప్పుకొనక తప్పదు. మానవులయందు పరివర్తనమును కలుగజేయుట, మానవుల వ్యత్యస్థముగ నొనర్చుటయే దానిస్వభావము. సర్వసంగ పరిత్యాగివలె నిది ప్రకృతచర్యల పరికించుచు. హితమును బోధించుచుండును. త్రికాలములను తనయాజ్ఞానువర్తులై యుండు నట్లొనరించుకొనును. తాను రూపరహితమై, నిర్వికారమై సకలసచరాచరమును నిర్దిష్టపథమందు నడిపించుచుండును. చూడండి సూర్యుడస్తమించుచున్నాడు. తిరిగి యుదయించుచున్నాడు. చంద్రుడు క్షీణించుచున్నాడు. మఱియు వృద్ధియగుచున్నాడు. ఋతువులు వచ్చుచున్నవి.

పోవుచున్నవి. అమావాస్యతరువాత పౌర్ణమ, పగలుతరు వాత రాత్రి యీ విధంగా రాకపోకలు, పోక-రాకలు జరుగుతూనే యుండును. ఇదియే కాలస్వభావము. అది కేవలము రానూరావటములేదు, పోనూపోవటములేదు. వేషమును మాత్రము మార్చుకొనుచున్నది.

మా వాడికి 20 సంవత్సరములు వెళ్ళినై. బి.ఏ. ప్యాసయినాడు. ఉద్యోగంలో ప్రవేశించ బోతున్నాడు. అనిఅంటారు అమాయకపు అజ్ఞానులు. పాపం వారు గ్రహించటల్లా వాని యాయుర్దాయములోనుంచి 20 ఏండ్లు తరిగిపోయినైయని. ఇదే మృత్యువుమాయంటారు. వాడిరువది సంవత్సరములు గడిచెనుగాని కాలం గడువ లేదు. మనం ఎంతమందిని చూచుటలేదు. నిన్న యేడ్చిన వాడు నేడు నవ్వుతున్నాడు. నేడు నవ్వినవాడు రేపేడ్చు చున్నాడు. తన భర్తృమరణానంతరమున వైధవ్యమునకై విలపించిన విద్యాధికురాలు నేడు విలాసవతియై, గృ హకార్యనిమగ్నయై సంగీత సాధనములయందే సమయ మును సరిపుచ్చుకొనుచున్నది. ఆ దుఃఖము నేడేమైనది? తన ప్రియ పుత్రునికై తన సర్వస్వము వినియోగించెద నన్న ధనికుడు పుత్ర మరణానంతరము సర్వసంపదలతో సర్వసౌఖ్యములు పొందుటలేదా? ఇదియే భగవల్లీల!!

*           *           *

"ప్రకృతి యనగా నేమి?" అని అడిగింది అంబుజం

తండ్రిని.

"ప్రకృతి యనగా మాయ. అదియేతల్లి. ఆ ప్రకృతి మహిమచేతనే సమస్త సృష్టి జరుగుతున్నది. ఆ ప్రకృతియే లేనిచో సృష్టికి హేతువేది? అనగా లేదు."

"తల్లిదండ్రులయొక్క సంపర్కచేత సృష్టిజరుగుచుండుట ప్రతిజాతిలోను చూచుచున్నామే? ఈ ప్రకృతిని మీరు తల్లియని వక్కాణించితిరి. అనగా స్త్రీయేగదా? ఆ స్త్రీకి పురుష సంపర్కములేకుండా సృష్టి యెట్లుజరుగుచున్నది."

"కొంచెమాలోచించిన యదియు తేలగలదు. ఎట్లంటే ఈ విషయమునే యర్జునుడు కర్ణుని యడిగినప్పుడు ఆయన బోధించిన శ్లోకమిది.—

శ్లో॥ "సర్వయోనిషు కౌంతేయ । మూర్తయస్సంభవన్తియాః।
తాసాం బ్రహ్మమహద్యోని । రహం బీజప్రదఃపితా"

గీత—

అనగా ప్రకృతియే తల్లియనియు సృష్టికనుగుణ్యమైన గర్భాదానకర్తయగు తండ్రిని నేననియు పురుషోత్తముడు బోధించెను. కావున స్త్రీ పురుష సంపర్కము మానవస్వభావములో నెట్లుజరుగుచున్నదో, ప్రకృతిపికృతులకు సత్వ రజస్తమోగుణ బద్ధమైన సంపర్కాలచే సృష్టికి హేతువౌనగూడుచున్నది."

"మాయ తల్లియని చెప్పితిరే? అట్టి మాయను జయిం

చినకాని మోక్షము సిద్ధించదుగదా? మాతృస్థానము వహించిన మాయను త్యజించుటయెట్లు?"

"పిల్లవాడు పెద్దయైనదనుక తల్లి పోషణమీద నాధారపడక యిదివరలో నలవడిన యితర పోష్యమును విసర్జించి స్వాతంత్ర్యముగ నుద్యోగము నార్జించి ధనార్జన చేయునట్లుగానే త్రిగుణబద్ధమైన యీ మాయను క్రమేణ జయించి యాత్మజ్ఞానియై విరాజిల్లుటలో సందేహమేల?"

"ఈ మాయయొక్క గుణము లేమి?"

"అవియే సత్త్వరజస్తమో గుణములు. ఈ సత్త్వరజస్తమో గుణములనుండి విముక్తియైనప్పుడు ఆ మాయ అనగా ప్రకృతియే బ్రహ్మమని గ్రహించ వచ్చును. అందు ముఖ్యముగా మనల నెక్కుడగా నావరించి ప్రతిబంధకమును గల్పించినది తమోగుణము. దానివల్లనే అజాగ్రత్త బద్ధకము, నిద్ర యనునవి యాత్మను నావరించు చున్నవి. ఇత్యాది గుణములను జయించినచో తమోగుణమును జయించినట్లే. ఇట్లే యొక్కొక్క గుణమునకు కలిగిన ఆ యా గుణభాగములను పరిశీలించి వానిని మన పాలన క్రింద నుంచుకొనవలయును గాని వాని పాలనయందుండరాదు. ఇట్టి పాలనాధికారము మనస్సునకు లేకుండుటచే తనే అన్య విషయాములందు మనస్సు జొచ్చి స్వతంత్రాధికారమును నశింపజేసి దాస్యశృంఖలముల పాల్పరచి భౌతిక శరీర సౌఖ్య సౌభాగ్యముల నశింపజేసి మిక్కిలి

చిక్కుల పాలుపెట్టుచున్నందుకు. అంతియే. ఒకడు పోషించుట, ఒకడు పీడించుట మొదలగు వ్యత్యాస భావములు వాస్తవముగ లేవు. గుణబద్ధుల మగుటచే లేనివాటిని కల్పించుకొని బాధాను వర్తులమగుటయేగాని మరేమియు లేదు. ఇంతలో శుష్క శరీర జటాధరుడొకడు తన ముఖమందు బ్రహ్మవర్చస్సు నాట్యమాడ, వామహస్తమున యోగదండము, దక్షిణహస్తమున కమండలము దాల్చి యొక నూతనవ్యక్తి వారి యొద్దకు చనుదెంచి విషణ్ణహృదయుడై నోట మాటరాక యందున్న అంబుజా శ్యామలరావులకు నమస్కరించెను. అపరిచితుడైన నూతనవ్యక్తి రాకయు, అందును యతివేషధారియు, అదియును గాక నొక సంపన్న గృహస్థునింటికి నతిథియై నరుదెంచుటయు ఆ గృహస్థుచే నాతిథ్యము నొందుటకు బదులు తానే ముందుగా నమస్కరించుటయు విపరీత స్వభావముగా దోచి శ్యామలరావు ఆశ్చర్య చకితుడయ్యెను. అయినను అతని చర్యలబట్టి ముఖవికాసము ననుసరించి యీ యపరిచిత వ్యక్తి యేదో మిషమీద యచ్చటికి వచ్చిన వేషధారి యని యనుమానించకపోలేదు.

"మీరెవ్వరు?" అని అడిగింది అంబుజం.

"నేనెవరో మీకిపుడవసరము లేదు."

"కార్యార్థినై వచ్చిన నా కట్టి ప్రశ్నలవసరము గాని మీకు కాదు."

" మీరెవ్వరో మేము తెలుసుకొనరాదా? "

" మీకంత యాతురత యనవసరము. కార్యార్థినై వచ్చిన నేనెవరినో యెరిగింపకయే వెడలుదునని యభిప్రాయమా? "

" అట్లుకాదు. గృహస్థులింటికి యాగంతుకులొచ్చినప్పుడెరుగక సత్కరించుటెట్లు? "

" నేను సత్కారము లొందుటకు వచ్చినవాడినిగాను. మిమ్ముల సత్కరించుటకే వచ్చినవాడను. "

" మీరేల సత్కరించవలయును? "

" ఏలవా! పీఠిసనేగుచుండ ఆత్మానాత్మ వివేక విచారణా సందర్భులైన మీ మధుర వాక్కు అస్పష్టముగా శ్రవణముల జొచ్చుటచే నట్టి విచారణానంద పానమొకింత గ్రోలి మిమ్ముల సత్కరింపనెంచి యిచ్చోట కడుగిడితిని. కాని మీ యథా ప్రసంగము నారంభింపుడు. ఇప్పుడు మీరేదియో 'గుణముల జయింపవలె' ననుచున్నారు. జయాపజయముల మాట మన కెందులకు. వాటి యావశ్యకత లేక సంసార సముద్రమును దాటి బైట పడగలిగిన పద్ధతులు లేవా? "

" మహాప్రభూ! అట్టివాని వినిపించి మమ్మనుగ్రహింపుము. "

" ఆ కృష్ణుడే సర్వవ్యాపకుడును, ఆదిమధ్యాంత రహితుడును, నిర్వికారుడును, సమస్త చరాచరకర్తయు,

యీ మాయాప్రపంచమున నధిష్టానదేవతయు, నగు తన్నెవ్వరు చలించని మనస్సుతో నెల్లవేళలయందు తన్నే గాంచుచు, తన్నే స్మరించుచుందురో వారు తన్ను చేరుదు రని వక్కాణించి యుండలేదా?"

వెంటనే అంబుజం " మీరు చెప్పినది బాగుగనే యున్నది. మాయాప్రపంచమని చెప్పితిరి. మాయాప్రపంచపు మానవులకు నిట్టి నిశ్చలమనస్సెట్లు చేకూరగలదు? "అనిఅడిగింది.

"ఈ సృష్టియంతయు స్థావరజంగమములని రెండు విధములుగా విభజింపబడినది. స్థావరములనగా కదలనివి. జంగమములనగా చలించునవి. జంగమములలో సమస్త మానవకోటి, పశుపక్ష్యాదిమృగజాతులు గలసియున్నవి. అందును జ్ఞానాజ్ఞానములను, కార్యాకార్యములను, న్యాయాన్యాయములను గుర్తెరుగ గలిగినజాతి మానవ జాతి. అట్టి మానవజాతియందుద్భవమందిన మనమే మన కర్తవ్యముల నెరుగక భోగాభిలాషులమై మనజీవితముల వ్యర్థమొనరించు కొనుచుంటిమి. మన యింద్రియముల భోగములమీది కుతికింపక సర్వకాలములందును యీ సృష్టిలోని సమస్తవస్తుజాలములందు, ఇష్టానిష్టభేదమును పరికించక, యన్నివేళలయందును విశ్వరూపుని ధ్యానించినచో తప్పక మోక్షముపొందగలము."

" అట్లయినచో యీ సంసార వృద్ధినెట్లుగాగలదు?

సంసారమందు సంగమున్నచో యీషణత్రయముపై మమకారమణగదే? ఈ షణత్రయమును జయించవలె లన్న సంసారవృద్ధి కడ్డుతగులుచున్నది? ప్రపంచవృద్ధికై పాటుపడుదమన్న దైవమునకు దూరమగుచుంటిమి? ఇక కర్తవ్యము! ”

“ అట్లునా! ఆ కృష్ణుడు గీతయందిట్లు చెప్పినాడు.”

శ్లో॥ “ తేషామహం సముద్ధర్తా। మృత్యు సంసార సాగరాత్।
భవామి నచిరా త్పార్థ । మయ్యావేశిత చేతసామ్ ”

గీత—

సంసార సౌఖ్యమనుభవింపుచు నెవరు విశ్వరూపు డగు తనయందు నిశ్చలచిత్తముచేర్చి ధ్యానింపుచుందురో అట్టివారిని తాను కాలమృత్యురూపమైన సంసారసాగరమునుండి దరిజేర్చును. అట్టివారికి తప్పక మోక్షప్రాప్తి కలుగుచేయును. 'తామరాకుపై నీటిబొట్టువలె' మన మీ సంసారముతో సంబంధము కలిగించుకొనవలెను. ”

ఇంతలో సరోజినివచ్చి “నాన్నా! 11 గంటల యింది భోజనానికి లేవచ్చు.” అని పిలిచింది. అంతా లోపలికి వెళ్ళారు.



రయిలూ కదిలింది. నారాయణమూర్తి హృదయమూ కదిలింది. చాల కంగారు పడుతున్నాడు. పిచ్చి యెత్తినట్లైంది. "నేను వారిని యెట్లు గాంచ గల్గుదును. నన్ను చూచి నా యింటికి రానగత్యము లేదనినచో చేయవలసిన కర్తవ్యము? అప్పుడట్టి యవమానమును పొంది బ్రతికియుండుట వ్యర్థమే గదా! అప్పుడెక్కడకు వెళ్ళి ముఖమును మరుగు పరుచుకొనవలెను. నా బాధ నెట్లు తెలుపుకొందును. భగవంతుడు నా హృదయములో నొక గొప్ప రాయి వేసినాడు. ఇప్పుడు తిరిగి యింటికి వెళ్ళినచో......! శ్యామల కదలనిచ్చునా?" ఈ భావములతో కునుకుపట్టినది. "తాను అంబుజాన్ని జూచుటకిష్టము లేక నేను రానని శ్యామలతో చెప్పగా ఆమె నిర్బంధించినది. తానా నిర్బంధము నుండి తప్పించుకొని పారిపోవ దొడగెను. వెంటనే పోలీసులు దొంగ! దొంగ! యనుచు పరుగెత్తసాగిరి. వారికందకుండ మిక్కిలి వేగముతో పరుగెత్తుచుండెను. కొంతసేపటికి శక్తి యంతయు తగ్గిపోవ దొడగెను. ప్రక్కనే యొక మేడ యగుపడెను. మెట్లు బజారు వైపునకుండెను. గబగబ వాటిపై కెక్కి మేడమీదికి వచ్చి ఎలక్ట్రిక్ తీగెలపట్టుకొని మరణించవలెనని పైకి ఎగిరెను. ఆ యెగురెచ్చుటికో పైకి యెగిరిపోయెను. అంత యెత్తు

ఎగిరి నెమ్మదిగా క్రిందకు దిగజార సాగెను. వచ్చి వచ్చి యెవరి యొడిలోనో పడెను. ఆమెను పరికించి చూడగా నామెయే యంబుజం." ఇంతలో సారథి "నాన్నా! బత్తాయి పల్లు కొనిపెత్తవూ!" అంటూ లేచాడు లేచి చూచు సరికి యది బెజవాడ స్టేషన్. నెమ్మదిగా బెజవాడ వదలింది. రాత్రి ఎనిమిదిన్నర గంటలకు దిగారు స్టేషనులో. నెమ్మదిగా యొక బండిలో బడ్డారు.

"ఎక్కడికి బాబూ!" అని అడిగాడు బండివాడు.

"భాగతీ బిల్డింగ్సు" అన్నాడు నారాయణమూర్తి తన భార్యతో "అవమానము జరుగునేమో!" అనెను.

"ఆ మాత్రమునకే అడలవలయునా? జరిగిన జరుగనిమ్ము? మీరు చేసిన ఘోరముకన్న మించదు గదా?"

"మంచి సలహానిచ్చితివి. అట్లయినచో నే నేల రావలయు? నీవే పొమ్ము! నే నా యవమానమును సహించలేను. నే నింటికి తిరిగిపోదను. ఏయ్ బండీ! ఆపవోయి."

"తప్పు మీదై యున్నప్పుడే యింతటి కాఠిన్యమును బూనుచుంటిరే; నిరపరాధులమైన వారి నేమన వలయు? మీరు రానిచో కార్యమాగునని యూహించుచుంటిరా? అట్లైన్నటికిని తలంపకుడు. ఇంతకును మీ యుద్దేశ్యము మరల తిరిగి పోవలయునని యా?"

"అట్లయినచో నేను బయటనే యుందును. వారే మందురో తెలిసికొని తరువాత నేగవచ్చును."

"సరే కానీండి!" బండి వేగంగా పోతున్నది. నారాయణమూర్తి హృదయం దానికి రెట్టింపు వేగంతో వెనక్కి లాగుతూంది. కాని తన మాట సాగటల్లా. బండి ఆగింది. "పంతులుగారి యిల్లు యిదేనండి" అని పెట్టె తీసుకొని గేటులోగుండా వెళ్ళి వాళ్ళ గుమ్మంవద్ద పెట్టె వచ్చి డబ్బుతీసికొని వెళ్లిపోయాడు.

* * * * *

సుందరోద్యాన మందలి పుష్పతతి సమన్వితమైన సౌగంధవాయువు ప్రియాన్వేషణార్థమైన సుదతీమణికి పురాతన పరాగమనమును గూర్చి సూచించుచున్నదో యన్నట్లు వీవసాగెను. అప్పుడే కుముదప్రియుడు ముకుళిత కుముదముల వికసింప చేయసాగెను. అంతయు నిస్తబ్దత వహించియుండెను. సన్యాసి యుద్యాన వనంలో గూర్చొని తపస్సమాధియందు మునిగి యుండెను. శ్యామలరావు గారు సమశీతల సౌరభవాయువుల గ్రోలుచు ఉద్యానవనములో విహరించుచుండెను.

సరోజిని వీణ తెచ్చి యంబుజంముందు పెట్టి పాడవలసినదని బలవంతపెట్టెను. అంబుజం "నను పాలింప నడచివచ్చితివో" అను కృతి, తనకంఠమును వీణతో కలిపి రసభూయిష్టముగ పాడుచుండెను. ఆమె కంఠనాదము మలయ మారుతంతో గలసి 'ఈ గాలికి సౌరభమే గాక కలకంఠనినాదముగూడ కలదా?' యనునట్లుండెను.

* * * * *

బండిదిగగానే సారథి "లానీ అమ్మా! లానీ అమ్మా! ఎక్కడున్నావే" అనుచులోనికి పరుగెత్తుకొచ్చెను. వారు పాటయుండే లీనమగుటచే వారీమాటలు వినరాలేదు. వారియెనుకకుపోయి "లానీ అమ్మా! లానీ అమ్మా! ఎక్కడున్నావ్" అంటూ వారిద్దరినిచూచి గబగబా యంబుజం వడిలో కూర్చొన బోయెను.

"నీవు ఎవరివు నాయనా!" అని అడిగింది అంబుజం.

"నీవేనా లానీఅమ్మవు." అన్నాడు. లక్షణ సమున్నతుడైన యా బాలకునిగాంచి, ఆతని ముద్దుపలుకులకు మురిసి, ఆతడుసాచిన చేతులకలరి తనవడియందు కూర్చొనబెట్టుకొనెను. ఆహా! అంబుజం ఆనందమెవరు చెప్పగలరు? ఎవరు వ్రాయగలరు? ఆమెజన్మ నేటికిగదా ధన్యత గాంచగల్గినది. నేటివరకట్టి ప్రేమను బడయలేకపోయె గదా! నేటివరకెవ్వరును నామె నట్లు ప్రేమపూరితముగ పిలచియుండలేదుగదా? నేటివరకెవ్వరు నంతటి ప్రేమతో నామె ఒడి నాక్రమించి యుండలేదుగదా? పుత్రహీనలగు వనితల జన్మము వ్యర్థమేగదా? అట్టి ఆనందము, అట్టి ప్రేమ, అట్టి పూర్ణానురాగము, అట్టి హృదయావేగము నేటికి లభించినది అంబుజానికి. ఇప్పుడామె నిర్మల, నిశ్చల, నిర్వికార, నిరుపమాన ప్రేమతరంగ డోలికల నూగజొచ్చెను. సారథి వడిలోగూర్చొని యామెగడ్డము

పుచ్చుకొని "అమ్మా! ఆకలేత్తుంది. అన్నంపెత్తవ్వూ? ..." అంటూ బయటవైపుకుచూచి "నాన్నా! లావేం!" అన్నాడు. అప్పుడంబుజం అతనినెత్తుకొని బయట వరండాలోకి వచ్చింది. వెంటనే సరోజినిగూడ వచ్చింది. అక్కడ పెట్టెరొకటిమాత్రమే యగుపడుచుండెను.

"మీ నాన్నేడే నాయనా! "అనిఅడిగింది సరోజిని.

గేతుదగ్గ... "

"గేటుదగ్గర యెవరో మాట్లాడుచున్నట్లున్నది" అనుచు అటువైపుపోసాగెను. నారాయణమూర్తి హృదయము కంపించిపోవుచుండెను. పారిపోవుటకు ప్రయత్నమొనర్చుచుండెను. కాని శ్యామల నిర్బంధించుచుండెను. అప్పుడే అంబుజం వచ్చి చూచి గుర్తించి రెండడుగులు వెనక్కు వేసెను. శ్యామల యామెను గ్రహించలా!

నారాయణమూర్తిని బలవంతముమీద లోనికి తీసుకొనివెళ్ళెను. అతడు తలవంచుకొనియే నెమ్మదిగా అడుగిడుచు వచ్చుచుండెను. శ్యామల అంబుజాన్నిచూచి "అక్కా" అనుచు ఆమెను కౌగిలించుకొనెను. ఆమె నిశ్చేష్టురాలై అట్లేనిలబడియుండెను. "అమ్మా! అడిగో నాన్న చూలవే!" అన్నాడు. ఆమె యేమియు బదులు చెప్పలేక నిలబడిపోయెను. ఇంతలో సన్యాసియచ్చటకు వచ్చి "దేవీ? అదుగో నీ భాగ్యదేవత!" అన్నాడు. వెంటనే అంబుజం నారాయణమూర్తి చరణద్వయముమీద

నెత్తి " తల్లీ! నీ జన్మ ధన్యము! దుష్టుడు నిన్ను కష్టపరంప
రల జిక్కఁజేసినను ఆ కారణమున యాత్మ జ్ఞానమును
దాల్చి ఈశ్వరోపాసన జేసి స్వస్వరూప సందర్శన మొంద
యత్నించిన నీ జన్మ ధన్యము!! 'తానొకటి దలచిన దైవ
మొకటి చేయునను, సామెత కలదు గదా! చిరకాల
వియోగ దుఃఖము నేటితో నశించినది. ( నారాయణ
మూర్తి వైపు చూచి భుజముపై తట్టుచు ) ఒరుల మాట
విని పెడమార్గమును ద్రొక్కినప్పటికిని 'కష్టే ఫలే' యను
నట్లు పశ్చాత్తప్తహృదయుడవైన నీవు తిరిగి నీ సౌభాగ్య
దేవత నాహ్వానించుటచే ధన్యుడవు! మీ ప్రేమానుబంధ
మునకు మూలకారణము పూర్వజన్మ సుకృత దుష్కృత
ములే! ఎడబాటు నొనగూర్చిన యొకానొక వ్యక్తి కేవల
స్వార్థపరుడై యన్య ప్రేమాపహరణ మొనరింప సమకట్టి
మేలు కీళ్ళను విచారింపక చేసిన ద్రోహమునకు తగిన
ప్రాయశ్చిత్తము జరిగినది. ఆ వ్యక్తియు తత్ఫలితముగ
యనేక దురవస్థలకులోనై చింతిలి, కృశించి, దేశ దేశము
లు దిరిగి చివరకు 'యద్దృశ్యంతన్నశ్యం' యనెడి నార్యో
క్తిని మనస్సున నుంచుకొని నిరతిశయానందము నొసగూ
ర్ప గల సాధన చతుష్టయము సంపాదించి ఒకప్పుడు తన
చేతితో విడదీయబడిన ప్రేమలతను తిరిగి సంధించుటకై
యీ రూపమున, యీ క్షణమున, యిచ్చట నిలబడియున్న
యీ దీనుని శత్రువుగా నెంచక మన్నింప గోరుచున్నాను,"

నారా: మీరిట్లుమాట్లాడుటలో నాకేమియు బోధ
పడుటలేదు.

శ్యా: అమ్మా! తామెవ్వరో తాము వక్కాణించిన
యీ నూతనవాక్యముల పరిచయము మాకెంతయావసర
మో మహాపతితులనైన మా కెఱింగింప వేడెదను

వ్యక్తి: నే నెవ్వరనో మీ రడుగకమునుపే చెప్పక వెడ
లనని మొదటనే వాగ్దానమొనరించితిని. అట్లనే యొన
రించెదను. ఆతురపడకుడు. ఏ వ్యక్తి తల్లిగతించుటచే
బాల్యమునుండియు నిచ్చటనేపెరిగి విద్యనభ్యసించెనో, ఏ
వ్యక్తి బాల్యమునుండియు నీమె ప్రేమకు దాసుడై మెలం
గెనో, ఏ వ్యక్తి యీమెతో గలసి తమహృదయముల ప్రే
మబంధములచే బిగించుకొనెనో, ఏ వ్యక్తి బాల్యమునుం
డియు నీమెనుతప్ప వేరొకయువతిని వివాహమాడనని
ప్రతినచేసి దానిని నెరవేర్చుకొనెనో, ఏ వ్యక్తి యీమెతన
ప్రేమబంధమును తెంపుకొని పరాధీనయైనను, తన ప్రేమ
బంధమును మాత్రము తెంపజాలక యన్య ప్రేమాప
హారణమును చేయనెంచి నీమె యమృతవాక్కులచే తుద
కు 'ప్రేమపాలనకై' సర్వసంగ పరిత్యాగి యయ్యెనో,
ఏ వ్యక్తి సర్వబాధలకోర్చి తనచే విడదీయబడిన ప్రేమను
తిరిగి సంధింపసమకట్టి దేశదేశముల దిరుగుచు కర్తవ్యపా
లనకై వీరి గృహమునకేగి బాలుని జ్వరబాధనుండి
మాన్పి ప్రేమబీజమును నాటి యిప్పటి యీ సంధానము

నీ రూపమున సమకూర్పగలిగెనో, ఏ వ్యక్తి ' ప్రేమపాల నకై ' తన భావిజీవితము నిప్పటిరూపముననే గడుపు నిశ్చ యించెనో యా ప్రభాకరవ్యక్తియే నేను. ఇకమీా యన్యో న్యానురాగ మభివృద్ధియగుగాక. నా పనిపూర్తియైనది. నేనేగుచున్నాను.

* * * * *

" బావా! ఫలహారానికిలే! త్వరగా రావాలి. "

" ఏం తయారుచేశావు. "

" నీకిష్టమైనవే. పచ్చడీ యిడ్లీ.

" ఏంపచ్చడి? "

" దోసకాయ పచ్చడి. "

" ఏందోసకాయ? "

" నక్కదోసకాయ "

" ఏం నక్క? "

" గుంటనక్క "

" ఏంగుంట? "

" బురదగుంట "

" ఏం బురద? "

" మట్టిబురద "

" ఏం మట్టి? "

" కాలుమట్టి "

" ఏం కాలు? "

" ముక్కాలు "

" ఏం ముక్కు? "

" బుర్రముక్కు "

" ఏం బుర్ర "

" పొడుముబుర్ర "

" ఏం పొడుము? "

" నువ్వు పొడుము, బావా నువ్వే పొడుము. "

" నాన్నా! అమ్మ లమ్మంతుందే "

" ఏ అమ్మ! "

" మా అమ్మ. లాసీ అమ్మ లమ్మంతుంది. "




ఉషా ముద్రణాలయమున శ్రీ రాజగోపాల్ చే ముద్రింపబడినది.
తెలప్రోలు, కృష్ణా జిల్లా.

వలయువారు:

శ్రీమాన్ దీవి శ్రీనివాస అయ్యంగారు, ఆత్మూకూరు.

లేక

శ్రీమాన్ బృందావనం శేషాచార్యులుగారు, హెడ్మాస్టరు

పామర్రు.

